శ్రీ

# సాక్షి

(గోష్ఠీనస మహాత్మ్యము)

గోమఠం రామానుజాచార్యులు

పండ్రెండణాలు

శ్రీ

# సాక్షి

(గోష్ఠీవన మహాత్మ్యము)

గ్రంథకర్త

## గోమఠం రామానుజాచార్యులు

వా న్నా రు.

ప్రథమముద్రణ క్రోధన సంవత్సర వైశాఖమాస శుద్ధ ౧౫

వెల 0-12-0  వెల ౦-౧౨-౦

# తొలిపలుకు.

పాఠకమహాశయా!

ఈదృశ్యప్రబంధరచన కాధారము బ్రహ్మవైవర్తపురాణాంతర్గత గోష్ఠీపుర మాహాత్మ్యము. కథ జగత్ప్రసిద్ధము. ఇందలి గుణాగుణవిమర్శనము జదువరులయందే యుంచితి. ౧౪ పుట ౨ పంక్తి "విసంగాఁడనివెన్నఁడైన" అనుటకు మాఱుగ "విసంగఁడనివియెన్నఁడైన" అనియు ౩౯ పుట మొదటి పంక్తి "ప్రారంభమున" అనుటకు "ప్రారంభమ్మున" అనియు ౪౬ పుట ౧౭ పంక్తి "ధర్మవిదుండవెందు" అనుటకు "ధర్మ్మఁడవెందుఁ" అనియుఁ జదువుకొన ప్రార్థితుఁడవు. అందందు ద్విత్వాక్షరములు లోపించియు సరియగు తావుల నర్థానుస్వారములుండియు లేకయుఁ దదితర ప్రమాదములుం గలవు. అవియన్నియు సవరించుకొని చదువుకొనినచో వందనీయుఁడవు కథాసందర్భానుసారముగఁ గాలపరిస్థితుల నచ్చటచ్చటఁ గుప్పవలసివచ్చెను. ఎచ్చోటనైనఁ బుచ్చకాయదొంగన్న భుజంబులు తడవుకొనకుందువుగాక. "యదిభవతి ముకుందే భక్తిరానందసాంద్రా । విలుఠతిచరణాబ్జే మోక్షసామ్రాజ్యలక్ష్మీః ॥

8-5-25.
పొన్నూరు.

విధేయుఁడు,
గోమఠం రామానుజాచార్యులు.

## పాత్రములు.

- కేశవుడు
- గోవిందుడు
- మాధవరావు
- రామభద్రుడు
- శ్రీభావనారాయణుడు
- శితికంఠుడు
- రామావధానులు
- పేరిశాస్త్రి
- కరటకశాస్త్రి
- రామశాస్త్రి
- వేంకటావధాని
- నారాయణభట్టు
- సిద్ధాంతి
- ఆంధ్రదేశభూపాలుడు
- అమాత్యుడు
- భీమన్న
- పేరయ్య
- అత్రిమాని.
- అక్కలక్ష్మి
- వెంకడు

పడవవాండ్రు, బెస్తవాండ్రు, ఎఱుకలవాండ్రు,
పంచాయతీసభ్యులు.

# అంకితము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీమదఖిలకల్యాణగుణపరిపూర్ణుఁడు నఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండు ధర్మసంస్థాపనాచార్యుండు దుష్టశిక్షణ శిష్టరక్షణ దీక్షాబద్ధకంకణుండు భక్తపరిత్రాణైక బిరుదాంకితుండు నార్తత్రాణపరాయణుండు నగు శ్రీ సాక్షి నారాయణునకు తన్నిరంతర సేవాచరణ పరలబ్ధ భక్తిపూరితహృదయపూర్వకముగఁ గౌండిన్యసగోత్ర గోమఠాన్వయ రామానుజదాససమర్పిత శ్రీ సాక్షి దృశ్య ప్రబంధ రాజము.

శ్రీ లవ్వారిగ నిచ్చి లోకులకు వా
సిం బుచ్చి వాఁడీన్ మగం
డాలించున్ జలగూర్చి యిష్వాకు ము
ఖ్యాల్ సాక్షియైనిల్చి స
త్యాలాపాన్విత భాంఘిస ప్రియతమం
బాడింపఁ దారార్కమౌ
దే, లక్ష్యంబుగ నాపురాణపురుషుం
డీశుండు రక్షించుతన్

సూత్ర:- (నాట్యంతమునఁ దెరసంకఁ జూచి) భావా! సుప్రభాతములు మూఁ
ముంగినతెఁ గూర్చుండు నేమోయి! నేఁడొక్కింత వెలికిరమ్ము.

(ప్రవేశము పారిపార్శ్వకుఁడు)

పారి: ఏమి శలవు?

సూత్ర:- నిస్పృహుఁడు మందమతియే యావేశించియుండు. అతని గుణసనిస
జ్ఞప్తి చేయుచుండవలయుఁగదా

ఉ॥ పండిత చంద్రముల్గల స
భం దిలకించుము! యింపుగాఁగ నె
ట్లుండెనొ! లోన యుత్సవము లె
ట్టుండెను? గొందఱుమూలమూల లం
దుండి కరధ్వనుల్సలుపు
చుండిరి; ధీనిధులెప్పుడా యటం
చుండిరి; కాలయాపనము
నోర్వరు; కాఁగల కార్యమేమికన్?

పారి:-సర్వము సిద్ధమాయెఁగాని, నన్నొకండుసంశయము మాత్రము పీడిం
చుచున్నది.

సూత్ర:-కలవులో నధికమాసమువచ్చి నట్లుగినియు నిప్పుడే తటస్థించెనా?

పారి:-అదియేమియులేదు. ఈనాఁడు మనము ప్రదర్శింపబోవు నాటకము
నకు గ్రంథకర్త యెవరాయని.

సూత్ర:-

మ॥ చిననాఁటం గవితాలలామఁ గని పెం
చెం బెద్దఁగావించె నా
య్యనఁ గౌండిన్యసగోత్రి వైష్ణవకులుం
డాతండు రామానుజుం
డనఘుండాతతభక్తిభాసురుఁడు నేఁ
డద్దాని శ్రీభావదే
వునకర్పించి కృతార్థుఁడాయె జనులిం
పుం బెంపుఁ బాటింపఁగాన్.

పారి:-ఆర్యా! తలఁచినకొలఁది తలంపులు తఱుఁగకున్నవి. ఈదృశ్యప్రబం
ధము నిర్దుష్టమై యిందుగల రసజ్ఞుల చిత్తంబుల నాకర్షింపఁగలదా?

సూత్ర:-ఓయీ! ఈవు తెలిసిన మూర్ఖుఁడవుగా నున్నావు.

చం॥ దొనఁగు లెసంగుతావుల బు
ధుల్గణుతించరు; కల్లుపట్ల స
ద్రసమున క్రోలు వారొరుల
తత్వముమాటఁ దలంపనేటికి
వ్వసుధను; నద్దిగాక భగ
వత్కథ యియ్యది భక్తియొండె మా

ననమున నిల్చు నేరికయు

నన్ శుభదాయకమై యనింద్యమై.

పారి:- ఇప్పటికిఁ దృప్తుఁడనయితి. ఇంక నాకిప్పుడు నియోగింపు కార్యమెయ్యది?

సూత్ర:- అట్టులనా? ఇంపులికగా విషయమై యొక్కింతయుఁ బ్రస్తావించవేమి?

పారి:- అయ్యది లోకములోని పోరాటమువంటిది కదా యని మిన్నకుంటి.

సూత్ర:- అంతియె కాదు బావా! దానిని శ్రీమన్నారాయణుండు సాక్షాత్కరించి నివారించె.

ఉ|| మేలములైన కయ్యముల

మించిన దియ్యది; తీర్పఁగానోరు

ల్లాలరు; మామయల్లుగకు

సంభవమాయెను గ్రుద్దులాటలు జల్

హేళనగాద చూపఱకు!

నింధనముల్ మఱిరెండు దోసిలి చెన్

జ్వాల రగుల్చు వారిలేరు

వంకల; నట్టిదిగూడఁ జిత్రమై.

పారి: సరి సరి. ఇంకనేమి? ఇదినాఁటికఁ దగవులేయున్నవి. నేఁడు మామయల్లుండ్ర కలహంబులు వచ్చెనా? ఈ విషయములోఁ జెప్పు వారి పులకరింపులు చప్పట్లు వినువారి వింతవలువలు చేసవేలు ఊరివారికిఁ జక్కగ బ్రొద్దుపోవును.

సూత్ర:- బాగుగఁ జెప్పితివి. ఇంక సమయ్ము కాలమతిక్రమించె. (నిష్క్రాం)

# ప్రథమాంకము.

1 స్థలము. స్వగ్రామమునందలి గృహము. కేశవుఁడు (కరణము) మాధవరావు (గ్రామాధికారి) నుపవిష్టులైయుందురు. సోమపాత్రుడు, భీమన్న, వెట్టివాఁడు వెంకటేశు, దూరముగ నిలుచుందురు.

కేశ—మాధవరావుగారూ! శిస్తువసూలు ముగిసెనా? నేను కాశీయాత్రకై నేఁడే ప్రయాణసన్నాహుఁడనైతినని మీకెఱుకయే కదా!

మాధ—ఎఱుక లేకేమి? అందుకనియే యిప్పుడు తమదర్శనార్థమై వచ్చియుంటిని. తమరింత శీఘ్రముగాఁ బయనమగుటకుఁ గతంబేమి?

కేశ—ఏమియును లేదు

శా. ఏదాటంతములనుండి యాశగలద
య్యా! కాశికాపట్టణ
ప్రాదుర్భాగ్యము గాంచ; నేఁటికది సం
ప్రాప్తించె మత్పూర్వపు
ణ్యాధారంబునఁ; గేశవున్నివుని న
భ్యర్థించి శ్రీభావదే
వోదారుం గని బిందుమాధవునిఁ బూ
జ్యుం గొల్చి వే వచ్చెదన్

తే॥ గీ॥ ఇన్నివర్షములు సంసారమిందు నందు
యుడయుదీర్ఘ సేవాభిలాషామె నేఁడు
కాశి కరుగుటేగా! కాళ్ళుగల ఫలంబు;
దేవు దర్శించుటయె! నేత్రదృష్టి కలిమి.

మాధ—నిజము సెలవిచ్చితిరి. మీవంటి పుణ్యపురుషులకే యిట్టి సంపన్నులు లభించు. సామాన్యజనులకేల జేకురును.

కేశ—(వెంకనికై తిరిగి) వెంకన్నా!

వెంక—సిత్తం. బాబూ! యిక్కడనే వున్నాను. సెబుతుల ఆజ్ఞ.

కేశ—ఈవేగ మెరకవీధినున్న అయ్యవారిగారు రామభద్రుని వేగ బిలిచికొని రమ్ము. అయ్యగారు కాశికి వెళ్లుచున్నారనియు వచ్చి పత్రము పుచ్చుకొమ్మని చెప్పుము.

వెంక—ఆఁ. (నిష్క్రమించును)

కేశ—భీమన్నా!

భీమ—అయ్యా!

కేశ—ఈవు గూడ మాతోడ వచ్చుటకు సంసిద్ధుఁడవైతివా?

భీమ—చిత్తము.

కేశ—నీస్థానమున బనిచేయుటకు కేరని మొహమాటముగ నెవ్వరికొంటివి?

భీమ—దొంతుల కాంతయ్యను.

కేశ—ఆతఁడు పనులు కొండంబడెనా?

భీమ—ఒక్కగంతు వేసి. తమరు చెప్పారంటే ఒంటికాలు మీఁద నిలబడతాడు!

కేశ—మంచిది. లోనికేగి మా గోవిందుని బిలువుము.

భీమ—(నిష్క్రమించును)

మాధ—ఈ భీమన్న మీతో సుంపవలసినవాఁడు. చేతికి గాలికి నక్కనవచ్చును.

కేశ—అవును. ఒడలువంచి పనిచేయువాఁడనిరేమి చేతిక్రిందనుంచుకొనఁ జూచుట. మాధవరావుగారూ! కృపయుంచవలెను. పునర్దర్శన లాభంబునకై మనమెల్లర మాయురారోగ్య సంపన్నులమై యుండునటుల భగవంతుఁ డాశీర్వదించుఁగాక.

మ॥ దయయుంచంగదవయ్యా! మున్ను మనపె
ద్దలన్న స్నేహంబిదే
నయ; పుణ్యంబునఁబోవు, మూరఁగల స
త్యంబున్ సధర్మంబు ని
ల్పి యశంబందుమయా! పురాధిపతి మీ
వేగాన నేనింతగా
నయసూక్తు ల్వచియింపఁగావలసె; నిన్
దామోదరుఁ డ్రోచుతన్.

(ప్రవేశము వెంకయ అయ్యలరాజు రామభద్రునితో)

మాధ — సెలవు గైకొనియెద. (నమస్కరించి నిష్క్రమించును)

రామ — నమస్కారములు. (నమస్కరించును)

కేశ — రామభద్రుఁడా? దర్శనమే కఱవయ్యె నేమోయి!

రామ — ఎంతమాటాడితిరి. వచ్చుచునే యుండఁ ద్రోవలో వెంకఁ డెదురై తమయాజ్ఞఁ దెచ్చె.

గీ॥ పెద్దలకడకైనఁ బెరుమాళ్ళ కడకైన
నరుగరాదు రిక్తహస్తములతో
ననుచు నాలసించితిని నంగడిని గొంత;
దండముతో సమాప్తి దాసు తప్పు.

(రెండు నిమ్మపండ్లు ముందుఁబెట్టును)

కేశ — (వానిం గొని) కుశాగ్రబుద్ధివి.

మ॥ పదియాఱ్వన్నెపసిండికిన్ వలపు సం
ప్రాప్తించు చందాన నీ

చదువుల్ నేర్చిన తెల్వితేటలకు వా
సంబై గుణంబుంగదుం
గుదిరెన్; మేలిట విశ్రమింపుము సఖా!
గోవిందుఁ డశాంతిమి
చ్చుఁదగన్ నీకుసిరుల్; మసంగ దవయా!
క్షోణిం జిరాయుండవై.

రామ—(ఆసీనుఁడై) పెద్దలయాశీర్వచన మహాభాగ్యము.

శేష—అందుఁజేతన్ సుఖంబకదా!

రామ—భవత్కారుణ్యాతిరేకమున.

గీ॥ ధరణినాఁబోతుకోరుఁ బేదల యశంబు,
పెద్దలున్నారు పిన్నల వృద్ధిగోర,
గోవిదులు మీరుగలరు మా కుశలమడుగ
నిరతము సుఖంబకాకియే కరిగెనుండుము.

శేష—రామభద్రా! పత్రమప్పగించుకొనియెదవా?

శా॥ నేఁడేఁగాశికిఁ బైనమైపెడలు ని
ర్ణీతంబు, గోవిందుడుం
దోడై కూడఁజరించుఁ గేశవమహా
త్మ్యంబూజ్యదర్శించి తో
డ్తోడన్ వచ్చెద వత్సరంబునకు గో
డుంగేడు లేకిల్లు గా
పాడన్నిల్వుము రాజకీయ ఘనకా
ర్యాయత్త చిత్తుండవై.

రాము—భవదీయాజ్ఞ శిరసావహించెద.

కేశ—అటులయిన సిరియే ఆహారములకెక్కు అందుకొనుము. తదితర పుస్తకము లవ్యావిదే గ్రైకొనుము. ఇంక భగ్రహయసుమా! స్వర్గమును వేయి కన్నులతోఁ జూచుకొనవలయును.

ఉ. వెన్నెల రాత్రులందు గలుగు
భీతి యొకింతయును లేదు, చీకటిఁ
గన్నను గన్నుఁగన్నుగన
రాని నిశల్ మన పెట్టివాఁడు వెం
కన్నపరుండు నిండి కడుఁ
గావలెనన్న లభించు సంగతిన్
అన్నియుఁ; బోడిపంటలు గృ
హంబున కొంచు సుఖాననుండుమా!

పురంబునందుగల వయోవృద్ధులయెడ భక్తివిశ్వాసములతో సంచరింపుము. చిన్నలపట్లఁ బ్రేమాస్పదుండవగుము. వ్యావహారికములందు లౌకికజ్ఞానసంపన్నులతోఁ గలిసి మెలఁగుము. కాని కొందఱు,

ఉ. కల్లకడానికిన్ మిగుల
కాంతివిధంబున జెంతఁనుంటరుల్
సల్లలితంబుగా నటన
సల్పుదురట్టివారలం ద్యజింపుమా!
తెల్లని వెల్లఁబాలుగను
దృష్టికి నల్లని వెల్ల నీరుగా
నుల్లమునం దలంచకుమా!
యోరిమి భూమిగ సంచరింపుమా!

రామ—చిత్తము. ఎట్టి పొరపొచ్చెము లేక లౌకిక జ్ఞానానుష్ఠానంబులనే యుక్కార్యముం జక్కఁగ నెఱవేర్తు. ఇవ్విషయమై మీకుఁగల విచా

రముండక్కి నిర్మల హృదయపూరితులరై కాశీ విశ్వేశ్వరుని సందర్శించి భావనారాయణ బిందు మాధవులం బూజించి సుఖాయత్త చిత్తంబున వేగమరండు.

గీ. కాలుఁగలిగి కాశికిఁ బోవఁ జాలకున్నఁ
బోయి మరలివచ్చిన పుణ్యపురుషునయినఁ
గని తనివిఁజెందు నన్నుఁబోలిన జనుండు
జన్మమునకెల్ల శివరాత్రి సాటిగాఁగ.

కేశ — ఇంకనొక్క రహస్యము.

సీ. పంటకాల్వలకు బోర్వాటిల్ల ధనము గుం
జక నాయము వచించి సఖ్యపరపు
తఱిని నీరియ్యకెవ్వరిఁగాని యేడ్పించ
కుపకారమొనరింప నుద్యమింపు
చేలగట్టుల తగాదాలు రూకలకాస
పడకున్న దున్నటల్ పగులఁగొట్టు
కలుచగొల్సును జేతఁగొని భూమియాత్రకమ
ణమని రైతుకు గీడొనర్పఁజనదు
గీ. కొండెగాండ్రఁ జేరువకైనఁ గూర్చరాదు
లంచగొండుల మొదలె వీక్షించరాదు
ఎరనుజూపి చేఁపను బట్టు నరులుగలరు
వారిమోచనల్ పెడచెవిం బడగ నిమ్ము.

శా. చేలా! పండినచిల్లు నిండుఁ బోడఁగుల్
చేపంగనే దుత్తలా

వేశ్యఁ బూడు నటంచుఁ బల్కు-రయితుల్
వేవేలున్నారు, నీ
పాలస్వై చితి నారినెల్లరను సం
భావింపుమా! సత్కృపం;
బాలన్ముంచిన నీటముంచిన భవ
ద్భారంబ యాఁ జుమ్మికన్.

రామ—ఆర్యవరా! న్యాయపథంబున నే సదా ప్రవర్తించెద.

గీ॥ జననమొందిన దాంధ్ర దేశంబునందు
గలిసి మెలఁగుటమీవంటి ఘనులతోడ
స్థిరతగంబైన చింతన దేశసేవ
యనృతమునఁ బ్రవర్తింతు నంచనఁగ రాదు.

కేశ—మేలు. ఇంకఁబోయిరమ్ము. ఇదియే కడసారిచరించుట. కడు మెలఁకువగ నడుచుకొనుము.

రామ—చిత్తము. సెలవు గైకొందు. (నమస్కరించి నిష్క్రమించును)

(ప్రవేశము వేఱొకప్రక్క నుండి భీమన్న)

భీమ—చిన్నయ్యగారు వస్తూవున్నారయ్యా!

కేశ—రానిమ్ము.

(ప్రవేశము గోవిందుఁడు పెద్దగూనుతో)

గోవిం—మామా! నాదేమియు నాలస్యము లేదు.

శా॥ మూటన్ముల్లెనుగట్టి బంధుజన స
మ్మోదంబుఁ గైకొంటి నీ
యాటోపంబె యవశ్యమాపయిని మా
మా! యత్తతోఁ జెప్పి యా

మా టాజ్ఞం గయికొందు సేనరిగి; భీ
మన్న న్ని యోగింపు, మా
పేటిస్ బేడను నెత్తిఁబెట్టుకొని తా
వి చ్చేయు శీఘ్రంబుగన్

కేశ—ఇంటఁగల యర్థాకృత్యంబులఁ జక్కఁబఱచితివా ? ఏనిందు రామ
భద్రుని రావించి, దస్త్రమప్పగించి, తగు కట్టుబాటులొనరించితి.
ఇంకఁ బయనఁబగుటరా, గోవిందుఁడా !

సీ॥ పసులకోపిన యెడ్డుకి సవోక్కయేఁడాటి
క్రింటనే నిలువ జేయించినావ?
మళిగ కేగిదినంబువలయు నుప్పను బప్పు
లెల్ల లోనికిఁ దెచ్చియిచ్చినావ?
వసలతాదులు వాడువడునేమొ తోఁటమా
లెను బిల్చి యొప్పఁగొలునిచినావ?
పవలు రేలును శాస్త్రవాదనల్ సలుపునీ
హితుల సన్మతిసుంత యెఱిఁగినావ
చనుట పరదేశమునకుఁ గష్టములువడక
గడవుకొనఁగా, వలయుముల్లెఁగట్టినావ
యొకట నొంటరుల్ పాలేరు లున్నవారు
వారిసౌఖ్యముల్ సమకూర్చివచ్చినావ

గోవిం—అన్నియు తక్షణములమీద సమకూర్చితిని.

కేశ—వెంకడూ !

వెంక—దండాలు ! దండాలు ! మహాస్వామీ !

కేశ — రాత్రులీ తిన్నెపైఁ బండుకొనుచు నిల్లు గాచుకొని యుండుము.
(అని గోవిందునితో నిష్క్రమించును)

వెంక — సిత్తం బాబూ! (వెనుకనే నిష్క్రమించును) (యవనికపడును)

2 స్థలము. తుంగభద్రానదీతీరము. ప్రవేశము కేశవుఁడు గోవిందుఁడుఁ బ్రయాణమొనర్చుచు, వెనుకనే భీమన్న పెట్టె నెత్తింబెట్టుకొని వచ్చును.

భీమ — (క్రిందదింపుకొనును)

కేశ — గోవిందా!

శా॥ అందందేకము మంద మందగమనం
బానంద సందోహమై
చెందంబందున వింపుచేయ నడయా
చెందుంగభద్రానదీ
సౌందర్యాతిశయంబు గన్గొనుమ! కాం
చంజాలవీ కండ్లు రెం
డుం; దోరంబుగ నిల్చె వృక్షములు బం
ట్లుంబోలె నిర్వంకలన్.

ఇది మహాపుణ్యతీర్థంబునుమా!

గోవిం — మామా! ఈ తుంగభద్రోదయవృత్తాంతము విన మనంబు కుతూహలంబయ్యె.

కేశ — దీనిది యుత్తమచరిత్రము. వినుము.

చ॥ హిమగిరిఁ బార్వతీశివుల
యిర్వురి పెండ్లికనంగు తండ్రి దే

వమునులతోడ వచ్చె; నిఁక
వారిఁ గనుంగొన సప్తలోకము
ల్గుములయి యుత్తరంబునన
కూడిరి; యంతట దక్షిణంపు భా
గమటులె పైకిలేచి చనఁ
గాఁ ద్రిదశాలయమంచె వింటివా!

చ॥ కని యిది దేవతాగణ ము
గస్త్యుని మౌనిగరిష్ఠు దక్షిణం
బున కనుపందలంచె; ముని
పోవుట కిష్టుఁడుగామిఁ బెండ్లి వే
డ్కను, జలమైనఁ దెచ్చుట కో
కండును శిష్యుఁడులేక చెంతనె
ట్లని మిషఁబెట్టె; భక్తవశుఁ
డౌ హరి యంతనొనర్చెఁ జిత్రమున్.

గోవిం—ఇంకనేమి! శ్రీహరి చిత్ర విచిత్ర కృత్యంబు లనంతములు.

కేశ--వివాహకార్య మగున్ఁడగు శిష్యుని వెంటనిత్తునని వచించె.

గోవిం—ఇప్పుడైన నగస్త్య మహాముని యొడంబడెనా? మరల నేదేని సాకు గల్పించెనా?

కే—చం. ఇది భగవానుపన్ను తన
కేగతిఁదప్పదటంచుఁ గ్రైన మూ
మోఁ దుదకు దక్షిణంబున క
తృప్తిని; వెన్కనె శౌరిశిష్యుఁడై

కదలి హుటాహుటిన్నడచెఁ;
గంజదళాక్షుని చెయ్దముల్వినం
గాఁ దనివెన్నఁడైనఁగలు
గం గలదా? చవులూరుఁ బైపయిన్

మ. గురుశిష్యుల్ సనుదేరి యావ్విధినటన్
గోదావరిన్దాఁటి భూ
ధరమాసహ్యాఖు చేరువన్నిలిచిరం
తన్మాని నోరెండె నెం
డాఁ రహిన్ సీర్గొనిరమ్మురమ్మనుచు మే
టిన్శిష్యు వీక్షించి వే
గిరమొందించె; మునీశ్వరాజ్ఞ నొకచ
క్కిన్ సున్న యేర్పట్టెడిన్

ఉ. ఇత్తఱి శిష్యరూపము వ
హించిన శ్రీహరి కొండ నెక్కి య
త్యుత్తమ యోగనిష్ఠ మెయి
నుండఁగదక్షిణహస్తమందు నం
పత్తిగఁబుట్టెఁ దుంగ; యల
వామకరంబున భద్రగల్గె నీ
యుత్తమవాహినుల్ గలిసి
యొక్కెడఁజెల్లెను దుంగ భద్రయై

అంతఁ గైటభారి యిమ్మహానదిం గోటి తీర్థంబులునిల్పి

గీ॥ అరసివైశాఖ పూర్ణిమయందునేని
యాలవిశాఖ నక్షత్రంబునందునేని

ప్రజలు స్నానమాడఁగనిందు బ్రహ్మహత్య
పాతకముఁబోవునంచు దీవనలుసలిపి

కం॥ ధారుణి లోనంగల భా
గీరథిగోదావరియును గృష్ణయు మఱి కా
వేరియును దుంగభద్రయు
నారయఁగాఁ బంచ గంగలైతనరారున్

గోవిం—మనసు తనివిదీర శ్రీహరి విచిత్ర చరితామృత పానముం గ్రోలితిని.

శా. మామా! యెంతటి పుణ్యభూమినివసిం
పన్నోచుకొన్నార మిం
కేమీ! ధన్యములాయె జన్మములు భ
క్త్యైకాగ్ర చిత్త ప్రభా
ప్రామాణ్యంబున నిందుఁ గ్రుంకులిడి పా
వన్ మేలు నాకంబు నం
దా మీఁ మాపితృ దేవతాచయముసౌ
ఖ్యంబందు యోజింపఁగాన్

కేశ—సమయోచితుండవు. ఇమ్మహానదిం గృతస్నాతులమై చనుటయే శ్రేయము. (మూటవిప్పి యంగవస్త్రములుగొని స్నానంబునకై యిరువురు నదిలోనికిదిగుదురు)

భీమ—యీ బావమర్దంతా ఆదొహా వెట్టి మొఱ్ఱి. ఏగుంటనీళ్ళుకనబడ్డా కాసల్లాగు మునుగుతారు కానీ వారువచ్చేలోగా ఒక్కపదమైనా పాడుకుంటాను. (క్రిందపడుకొని)

"వోరయ్యో కొయ్యాడ తోయ్యాలి పరాయిదిగాదు
• తోబుట్టుకూతురో ॥రయ్యో॥ ఇగుగు పొరుగువాగి

మాటలెన్నడు చెవిని బెట్టకురో॥రయ్యో॥ యీడుజోడు
గలదని యింతదూరముచేస్తిరో ॥రయ్యో॥"

(కేశవుఁడు గోవిందుఁడు స్నానముచేసి తడిగుడ్డలతో గట్టుపై
సంధ్యావందనాద్యనుష్ఠానపరులై యుందురు)

"చిట్టెమెక్కిన లబ్బరుబండి సీలజారిపోయింది సీలాజారి
పోయినగాని బాలకు పరవాలేదురో॥రయ్యో॥ కురుచ
మొక్కల నీటవంటికుందనా యిడి కూతురో యిటునుంచి
నలువది యటునుంచి నలుబది యెనుబదిరూకలుపోయిన
గానీ యిల్లునిండీన పెళ్ళామురో॥రయ్యో॥"

కేశ—(లేచి పొడిబట్టలుధరించి తడిగుడ్డలారవైచుకొనుచు) భీమన్నా!
ఇంకఁ బయనముగుదమా ?

భీమ—(ఉలికిపడిలేచి) చిత్తం. (పెట్టె నెత్తిఁబెట్టుకొని ముందునడచును)

గోవిం.—మామా! మనకింకఁ గృష్ణా గోవిందా యను స్మరణదక్క నేమి
కావలెను! కాలుసాగించెదము. (నిష్క్ర.)

(తెరయెత్తబడును. కృష్ణానదీతీరము. పడవవాండ్రు పడవనులాగుచుందురు)

(ప్రవేశము భీమన్న గోవిందుఁడు కేశవుఁడు)

భీమ—(మూటఁ గ్రిందఁబెట్టి) యేరేదో అడ్డమేవచ్చింది.

గోవిం—(కృష్ణకై తిరిగి కరములుమోడ్చి)

గీ॥ పాపహారిణి! యఖిలఘోరదురితవ్రజకృపాణి!
కేలుమోడ్పు! ప్రవాహినీ! కృష్ణవేణి

కేశ— జయము! వసుమతీ సర్వ సస్యములప్రాణి
కేలుదోయి! సత్పావనీ! కృష్ణవేణి!

మామా! దీని పుట్టు పూర్వములం దెలుపవేమి ?

కేశ—ఇందాఁక నేజెప్పనుంచితి.

మ॥ జలముం దెచ్చుటకా యగస్త్యుఁడనుపన్
సహ్యాద్రిపై శౌరి ని
ర్మల యోగంబుననుండ నాతని శరీ
రంబందునం గృష్ణ భా
సిలె; వేణింజని యుంచె వేణి యివి వా
సింజెంది రెండేకమై
యిల నొప్పారెను గృష్ణవేణియని యెం
తే నిద్ధి ప్రాజ్యార్హమై.

ఇందును స్నానంబొనర్చి యర్హాకృత్యంబులొనర్తము.

ఉ॥ ఏ దొరబిడ్డకైన ఘటి
యించ దొకించుక ప్రాప్తి లేమిఁ బు
ణ్యోదయ హేతుభూతమగు
నుత్తమతీర్థపుసేవ; యుత్తరా
భేదకు బెన్నిధానము ల
భించిన చందము కృష్ణలోన నేఁ
డాదట భక్తిముక్తి కొఱ
కై జలకంబులనాడి పోఁదగున్.

(అంగవస్త్రములు గట్టుకొని స్నానమునకై నదిలోనికి దిగుదురు)

భీమ—మళ్ళీ నీళ్ళు కనబడ్డాయి. ఇఁక మూఁడు జాములకుగాని కూడా యుండరు. పొద్దున్నే చట్టిలో చద్దిఅన్నము తినేవాణ్ణి, వీళ్ళ తానాలెప్పుడవుతాయి? (అని క్రిందఁ బట్టఁబఱచుకొని వెల్లకిల బరుండి పాడును)

"కోడీ నాకోడీ నీవేడ కేగితి వేయుద్దు॥ కోడీ॥ పాదు వందెముగట్టి యుల్లవానిపొట్టన బెట్టితీ॥ కోడీ॥ నూజవీడునుంచిబల్

మోజుతో గ్రహించితి రోజుతో దుతినిపించి గాజుకాయవలె పెంచితే॥ కోడీ॥ యందమైనయదే నీకిందిచూపుతీరె ముందు పందెమేయబోతె పరపంగిపిల్లకు జయమాయె॥ కోడీ॥ పందలా దినిచ్చి నిన్నిందుగొని తెచ్చితి పందెగాళ్లుమెచ్చి పైపందెమిడ వచ్చిరో॥ కోడీ॥ బొడ్డుముళ్లెలాగి మంచి బుడ్డిసారాయి తాగి హైరోడ్డుమీదజాగిపోర్లి దుడ్డుపోటుకాగితీ॥ కోడీ॥"

కేశ-గోవిం—(తడిగుడ్డలతోఁ బ్రవేశించి) లేలెమ్మ. ఆదరికేగి భోజనము లొనర్చి యొకింతక చల్లబడఁగానె బయలుదేరుదము.

భీమ—(గట్టిగా) ఓయ్ పడవా ! పడవా! అయ్యగార్ని దాఁటెయ్యాలి. యిటుగాండ్రొస్స (మూట నెత్తిం బెట్టుకొని) అదే పడవ అక్కడికి వస్తావుంది పోదాం పదండి. (నడచుచు) ఇది యయిందాక గోదావరి గోడ గడ్డలు ఉంది కాబోలు. (నిష్క్ర)

(తెర యెత్తబడును. గోదావరీనది ప్రవేశము ఇరువురు బ్రాహ్మణులు సుబ్బావధానులు కరటకశా(స్త్రి))

కర—సుబ్బావధానులుగారూ ! నేఁడు మీకేమాత్రము పద్దు ? ఉదయమున ఎవరిమొగం చూచితినో కాని దమ్మిడీనైన దొరకలేదు. ఎవరైన పేటికి స్నానానికి వస్తారేమోయంటే ఒకూనా వచ్చేదిలేదు చచ్చేదీ లేదు.

సుబ్బా—కరటకశాస్త్రులుగారూ ! అదుగో అటుచూడండి నుగ్గురు బాటసారులు వస్తూవున్నారు.

కరట—రానివ్వండి మీపుణ్యమాయున్నూ. చేతులు గుణాడించుకొంచూ ఇంటికిపోతే కొంపోకా అకంగో పెట్టుకొన్తూంది.

(ప్రవేశము కేశవుఁడు గోవిందుఁడు భీమన్న)

కేశ-గోవిం—బ్రాహ్మణోత్తములారా! నమస్కారములు.

కర—సుఖీభవ. మీరు యాత్రికులా ? గోదావరీ స్నానము చేయుదురా ?

కేశ—గోదావరీ స్నానమొనర్తుము గాని ఖైదులోమాత్ర ముండజాలము.

కర—(నవ్వుచు) బాగాచెప్పారు. నాతోడకండు అట మంచి కేవుగలదు.

(నిష్క్రమింతురు)

భీమ—వారు వచ్చిందాక నాకు అటిడుపే. (పాడును)

"ఓరోరిబండివాడా ఒయ్యారిబండివాడా
నీవుపోయే బాటలోనే నిమ్మచెట్టున్నదీ
నిమ్మచెట్టుకిిందను నిలువటద్దమున్నదీ
... ... —— —— —— ——
చెవులకుపోగు తేరా చేతులకుమురుగు తేరా
కట్టుకొనుకోక తేరా పెట్టుకొనునగలు తేరా
కొప్పులోకి పూలు తేరా.........॥ఓరో॥"

(కేశవుఁడు గోవిందుఁడుఁ బ్రవేశింతురు)

కేశ—(గోవిందునితో)

ఉ. పావనమాయె జీవన ము
పారసుమాంజలులిచ్చినాము గో
దావరిఁ దానమాడి; యతి
ధన్యులమైతిమి; నర్మదం గనం
గా వెసఁ గోర్కెపుట్టెడి నె
కావెకిఁబోదము నేఁటి దాఁక నా
శ్యావహాతీర్థయాత్రికుల
మైతిమి కేశవసత్కృపారతిన్.

గోవిం—నిక్కము వచించితిరి. ఇంకఁ జనుదము రండు. (నిష్క్ర—)

(తెర యెత్తబడును. నర్మదానది. ఇరువురు బెస్తవాండ్రు. ఒకఁడు చేత గాలము బట్టుకొని రెండవవాఁడు చంక బుట్టఁ దగిలించుకొని ప్రవేశింతురు.)

మొ. వా—ఓరేయ్! ఇయ్యాల, నీయాలిమగఁడా! బుట్టనిండా రొయ్యలు యేసుకెల్లాలి.

రెం. వా—అరే నీయాసద్దానంగాను బొద్దెక్కిందిగా! నిద్రమంచంకాడ సద్దికూడ్తిన్నాం. కడుపులో మంటెగెత్తుకొస్తూవుంది.

మొ. వా—నర్మదలో రెండు పెద్దసేపల్ని లంకెంచుకుందాం.

రెం. వా—ఇప్పుడేందిరా? మిట్టమద్దాన్నంకాడ. ఓల్లటుచూడు. జేప నయ్యలు తానాలాడి దరికొచ్చి మరేం ముక్కట్టుకుంటున్నారు. ఆడకెల్లితే దూరానికొక్కడతారు.

మొ. వా—అయితే రారోస్సి పోదాం. కూడుమెక్కి సంజేల వద్దాం.

(ఒకప్రక్కనుండి నిష్క్రమింతురు వేఱొకప్రక్కనుండి ప్రవేశము కేశవుఁడు గోవిందుఁడు)

కేశ—ఉ. తానములాడి నర్మదను
దప్పనిచెయ్వులొనర్చి యొంటిసే
పైనను రాడు భీమన ప్ర
యాణభరమ్మున వెన్కఁజిక్కెఁ; నీ
వైనఁ బసంగదయ్యె నిటు
లైదు నెలల్మనతోడ నాతఁడున్
వానకు నెండకోర్చి యిలు
వాకిలి వీడిముదంబుఁ జెందెడిన్

గోవిం—(వెనుకకుజూచి) మామా! భీమన్న యిదే వచ్చుచున్నాఁడు పాపము కడుడస్సియున్నవాఁడు.

(ప్రవేశము భీమన్న మూటఁగ్రిందవైచి చతికిలఁబడి)

భీమ—అమ్మయ్య !

గోవిం—ఎన్నఁడో చచ్చిన అమ్మ అయ్య వీనికి నేఁడు తలంపునకువచ్చిరి.

భీమ—అంతేనా ? తలప్రాణం తోకకొచ్చిందికూడాను.

కేశ—భీమన్నా ! ఇట సుఖంబుగ విశ్రమింపుము.

గీ. వారణాసీ పురంబిదే చేరువాయెఁ
దలఁప మనకు భాగీరధిదాఁటు టొండె
ఎనయునాలుగైదు దినంబు లిందుగడపి
చనుదమా పైన నిపుడు మించినది లేదు

(తెరపడును)

# ద్వితీయాంకము

1 స్థలము, గంగానది యవతలిగట్టు. ప్రవేశము మిరపపుర శాస్త్రులు, రామశాస్త్రి వేంకటావధాని. వేకువజాము సమయమున.

వేంక—రామశాస్త్రీ

శా. పూర్వాద్రిన్ ధవళింపు ధూమనికరం
బుద్దోఁచెఁ; నొండొండె ని
గ్గర్వాల్ తారలు జాఱె; వెల్వెలను శా
ఱన్ వేగుఁజుక్కాగె; నీ
యుర్వీదేవతలెల్ల రుజ్జ్వలతరం
గోత్తుంగగంగా మహా
పర్వాధీనులరౌచు స్నానములొనం
ర్పంగఁ గంటివే! యయ్యెడన్

రామ—మిత్రమా! వేంకటావధానీ! భళి భళి అదియుఁ జూడుము.

శా. యతులాచెట్టుల క్రాఁగట్టిన యసం
ఖ్యాకంపు నీర్గావిధా
వళులందం బరుణార్కకాంతుల నదీ
భాగంబుపైఁ జిమ్మెఁ; సం
తత వేదాధ్యయన ప్రబోధకుల చం
దంబున్ విచారింపు; మా
యత కాశీనగరంబు పొల్పెసఁగు నా
హా! భూతలస్వర్గమై

వేంక—అయ్యాది సూర్యోదయము కానుండె. ఇంక మన మేగి విశ్వేశ్వరాలయమున నేఁడు జరుగఁబోవు పూజావిధులం గాంచుదము.

ఉ. దానపరాయణుల్ మఱియు
ధర్మవిదుల్ నిరతాన్నదాన సం
ధానులు సత్యసంధులు ను
దాత్తులుఁ గూడుక కాశి నిత్య క
ల్యాణము పచ్చతోరణము
నై విలసిల్లును మోక్షదాయకం
బై నెగడున్ జగంబెఱుఁగు
నట్టి ద్విజన్మనకేల జందెమున్.

(నిష్క్రమింతురు. వేఱొకప్రక్కనుండి కేశవుఁడు గోవిందుఁడు యథావిధిఁ గృతస్నాతులై ప్రవేశింతురు)

గోవిం — మామా! ఇమ్మహానది సర్వకలుషాపహారిణి

గీ॥ శివశిరంబునుండి హిమాద్రిశిఖరినుండి
భరతఖండంబునుండి సాగరమునుండి
నాగలోకంబుఁ జేరెఁ బుణ్యముల బొంగ
రంగదుత్తుంగ విచలత్తరంగ గంగ॥

కేశ — అటు గనుఁగు.

గీ॥ అతులిత విరాజదేవ విద్యాస్పదంబు
ఘనయశస్సార సుజన సౌఖ్యప్రదంబు
దర్శనీయంబు మఱి మోక్ష దాయకంబు
శ్రీరమేశాకరంబు కాశీపురంబు.

మ॥ అవె సౌధంబులు గోపురాగ్రములు ప
ణ్య శ్రేణు లెన్నెన్నొ యు

ఇత్యాదియే సంస్కృతపాఠశాలలపై ని
త్యం బన్నసత్రంబు లెం
తో విరాజిల్లెడు ! నట్టులేగుదము ర
మ్మో మేనయుల్లుండ ! కే
శవ సందర్శనముం బొనర్చెదము సం
సారాంబుధిన్ దాటఁగన్.

(తెర యెత్తబడును. శివకేశవబిందు మాధవాలయములు ముందునడచి)

కేశ—గోవిందుఁడా ! ఇత్యాది కేశవాలయము ఆ దశావతారపురుషునిం జూడుము. జన్మములు తరించును,

సీ॥ నారీమణులఁబట్ట గాఁరించు నసురన్ వి
దారించుశౌరి ! జోహారు నీకు

గోవిం- నినుగాదనిన దానవునినున్ని చిన్ని భ
క్తుసిఁబ్రోచు శ్రీశ ! వందనము నీకు

కేశ- చాపచుట్టగ ధరం జంకఁబెట్టిన దైత్యుఁ
జెండిన హరి ! నమస్కృతులు నీకు

గోవిం- ఉదధి వేదము దెచ్చి యురుధర్మ ముద్ధరిం
చిన చక్రపాణి ! జేజేలు నీకు

కేశ- వాసుదేవ ! దామోదరా ! పద్మనాభ !
అచ్యుత ! జనార్దనా ! కేశవా ! నమోస్తు

గోవిం- కృష్ణ ! గరుడధ్వజా ! హృషీకేశ ! శౌరి !
శ్రీపతీ ! చక్రపాణి ! శార్ఙ్గి ! నమోస్తు.

కేశ—కుత్తా ! ఇమ్మహామహుండె సృష్టికర్త. భక్తపరతంత్ర. బ్రహ్మహత్యాది పాతక నిర్మూలనవేత్త, మోక్షప్రదాత. వేదవేదాంగోపనిషద్భాష్యాంతరాత్మ.

గీ॥ సూర్యచంద్రుల నడపించు శోభితుండు
త్రిభువనంబులుఁ బాలించు ధీవిశాలి
యుభయహస్తుండు భక్తులకాటపట్టు
కేశవుండియ్యనఘు వల్లఁగాశియయ్యె

గోవిం—ధన్యోస్మి. ధన్యోస్మి.

కేశ—ఆదనకేగుదమురమ్ము. (ఇరువురు శివాలయమునకేతెంచి) ఇందు శితికంఠుఁ డుదాసీనుఁడైయుండుఁ గనుంగొనుము.

సీ॥ పునుకఁజేఁగొని బిచ్చమునకేగియు నభీప్సి
తములిచ్చు దేవ! వందనశతంబు

గోవిం- వల్లకాటను వసింపఁగఁజెవిన్ రామ మం
త్రమునూదెదుహరా! కరంబుమోడ్పు

కేశ- జనులఁ బ్రోవఁగ గళంబున హాలాహలము మె
క్కిన చంద్రశేఖరా! కేలుదోయి

గోవిం- భూకంటకములైన ముప్పురంబులఁగాల్చి
ముద మొసంగినశివా! మ్రొక్కులివియె

కేశ- పశుపతీ! శూలి! శంకరా! వామదేవ!
హర! మహాదేవ! మృత్యుంజయా! నమోస్తు

గోవిం- ఈశ్వరా! త్రిలోచన! భవా! కృత్తివాస!
ఉగ్ర! శితికంఠ! గిరిశ! శంభూ! నమోస్తు

కేశ—గోవిందా! అటుచనుదము రమ్ము. (బిందుమాధవాలయ ప్రాంగణమునకేతెంచి) ఇందు బిందుమాధవస్వామి వెలయు-

గోవిం—మామా! విన వేడుకయగుచున్న



కేశ-చ॥ తనరఁగఁ బుణ్యగంగయును
ధర్మనదంబును, ధూతపాప వా

హిని, కిరణాతరంగిణి, యు
దే యమునానది యైదుఁగూడి పం
చనద సుతీర్థమై వెలయు;
స్నానమొనర్పఁగ నందు, భూమిసే
మానుజుఁడునైన ముక్తిఁగొను
మాడి నశించును పంచపాపముల్.

మ. గరిమం బంచనదంబునం దపసి యొ
క్కండగ్నిబిందుండు శ్రీ
హరి పాదాంబుజ చింతనామృతరసం
బాశించి క్రోలంగనే
కగుణాంతఃకరణుండు మాధవుఁడు వీ
కన్ దర్శనంబిచ్చి త
ద్భిరుదున్ రక్షణముం బొనర్చుకొనియెన్
విన్నాఁడవే! బాలకా!

గీ. భక్తపరతంత్రుఁడౌట విశ్వంభరుండు
బిందు మాధవుండనుపేర నిందుమునికి
పెక్కుధర్మవ్రతంబులన్ విప్పిచెప్పి
కాశినున్న స్వరూపముల్ గడకునుడివె.

ఉత్తమతీర్థములలోఁ నిదియు నొండు (ఇరువురు నమస్కరింతురు)

గోవిం—మామా! ఇంక భావనారాయణాంతికమ్మున కేగుదమా?

కేశ—నడువుము. (తెర యెత్తబడును. భావనారాయణాంతికము. ముందు విమానముండును)

గోవిం-కేశ—(విమానమునకు నమస్కరింతురు)

కేశ—గోవిందా! ఇది దివ్యరత్నఖచితంబగు విమానంబు. శ్రీ మన్మహా

విష్ణు సందర్శనముం గావింప నేడుకత్యములు దాటిపోవలయు రమ్ము. (అట్లు నడచి)

గీ. భావనారాయణాఖ్య! దశావతార!
భక్త ముక్తిప్రదాత! వేల్వందనములు
గోవిం-శూరవర! జగన్నాటకసూత్రధార!
వేదవేదాంతపురుష! నిన్వినుతిఁజేతు.

కేశ—ఈ దేవదేవుని వృత్తాంతమడుగ వేమి? ఆకర్ణింపుము. శ్రవణానంద కరము.

మ. మనకుంబ్రాపగు యోజనద్వయబృహ
ద్ధ్వాంగల్యాగోష్ఠి వనం
బునఁ బత్యక్షురమా విభుండు తొలిఁ గా
ల్వొందిర్చు; నక్కాలమం
దున భాగీరథిచెంత నత్రిముని యిం
దున్నిర్భరానందుఁడై
ఘననిష్ఠం దపముంబొనర్చె హరికై
కంసారికై శౌరికై.

ఉ. అందు మురారి యత్రి విన
యానతసన్నుతులెల్ల పీనులన్
విందుగ నాలకించి యతి
వేగమ దర్శనమీయకున్నఁ దా
నిందితుఁడౌనటంచు మది
నెక్కొనుభీతిఁగలంగి సంతతా
నంద మయుండు శ్రీహరి జ
నార్దనుఁడాశ్రితవత్సలుండొగిన్

క॥ అంతటస్వాయంభువ మ
న్వంతరమునఁ గృతయుగంబునఁ బ్రథమదినమం
దెంతో ముదంబున న త్రికిఁ
గంతుజనకుఁడిందుఁడో చెఁ గాశిన్ వాసిన్.

గోవిం—ఆహా! ఆమహామునీశ్వరుని పూర్వజన్మ సుకృతము. ఎంతటి నోము నోచుకొనఁగా నట్లు హరి సందర్శనము లభించు!

కేశ—గోవిందా! ఇందొకింత విశ్రమింతుము (ఆసీనులై) కష్టా!

చ॥ ఇలువిడి నేఁటి కాఱో మఱి
యేఁడో నెలల్ననెఁ దీర్థయాత్ర ని
ట్టులు ముగియించినారము క
డున్ భగవాను కృపారసంబుచే
నలజడి లేదొకింతయు గృ
హంబుఁదలంచినఁ జేయి వెట్టి లోఁ
గలచినయట్టులౌ హృదయ
కంజమునన్ మలినంబు కల్గెడిన్,

గోవిం—(ఆతురమున) మామా! నేఁడదిరేమి? అందఱము సుఖంబున నున్నవారము ఇంటివద్దను బరమేశ్వరానుగ్రహంబుచే నెట్టి ఇుక్కట్టులు లేకుండు. ఇంక వగవ నేటికి?

కేశ—ఓయీ! అది కాదు. నా విచారకారణము వేఱొండు.

ఉ. యాత్రలు సల్పినారమిటు;
లార్యవచోక్తులు జ్ఞప్తి వచ్చెహో!
పుత్రులు లేనివారలకు
బుట్టవు సద్గతు లందు రక్కటా!

పుత్రిక యైన నొక్కరితుం
బుట్టదు నేటికి; భోగభాగ్యముల్
ధాత్రిని నెన్ని కల్గినను
దాన ఫలంబది యేమి పల్కుమా!

గోవిం — నీ విచారమునకు హేతువు కనుగొంటిని. మామా! ఒక్క విష యంబుగూడ యోజింపుము. పుత్రులుగల్గిన ధృతరాష్ట్రునకెట్టి సద్గతి లభించెను? కొడుకులు లేని యా శుకునకు దుర్గతి వాటిల్లెనా?

గీ|| కొడుకు గల్గుచోఁ దల్లిక్రిందఁ గొఱవిఁ బెట్టు
నిష్టమున్న నేటేట నీళ్ళు విడుచు
నెదియుఁ జేయ పట్టిఁ జాల గోరదిమి నాకు?
యేని పుణ్యపాపములు లవ్వానికగును.

కేశ — అద్దియు విచారించితిని. సుతుండు లేకున్నను బాలికయైనఁ బుట్టిన కన్యాదానఫలంబయిన దక్కు నని కుతూహలము.

గోవిం — ముక్తికి నీయాశ యింతియేకదా? ఆలకింపుము.

ఉ. ఓయయ! పుత్రిఁ బుట్టుటకు
నోర్పుగ నాకిడి దానిఁ బెండిలిం
జేయుదు నేని నిక్కముగ
చింపుము శ్రీహరి వేడికొందు నే
నీయెడ, నీకొక ద్రవ్యము
నిస్సంశయముగ; నిశ్చయమిమ్ము భావనా
రాయణ సాక్షిగాఁగ; నింక
సంగము శక్తికొలంది చూపెదన్.

కేశ — గోవిందా! ఈ వింత నిర్ధారణపూర్వకముగ నడుగవలెనా?

మ. అరయన్ నాకొక పుత్రికల్గవలెఁగా
కద్దానఁ గొంపోతయా

కరిపై నెక్కిన యట్టులుండదె ? యిటం
గంజాక్షుఁడే సాక్షిగాఁ
గ రహిన్ విన్మిఁక నీక పిల్లనిడి కా
న్కల్గట్నముల్ తోడ ని
ల్లరికంబుంచుకొనంగ నొప్పెద నిఁకే
లా ! సందియంబి త్తటిన్.

గోవిం— మేలు మేలు మామా ! ఇంక నీవటుండుము. (అని భావనారా యణుని సమీపించి చేతులు మోడ్చి) దేవాధిదేవా ! గజరాజవరదా! ఆపద్బాంధవా ! ధర్మాధర్మ విచక్షణా ! శ్రీ భావనారాయణా !

ఉ. ఇందు ఘటిల్లినట్టికథ
నెల్లను వింటివి కాద! యింక మా
సంఘునసాక్షివీవ దయఁ
జాలగనంచుము! చక్కనైన క
న్నొందగ మామకిమ్ము కడు
నెయ్యమెలర్ప నన్నుగహింపు గో
విందా ! చతుర్భుజా ! యభవ !
వేడుక నన్ను గృహస్థుఁ జేయుమా!

క. సూరన్నృతంబుల నాడియు
ధారుణి నొకగృహమునిల్ప ధర్మంబనిరీ
తీరున నిను నేఁగొలితి
నారాయణ! మఱవవలదు నాయానసుమా!

(సాగిలఁబడి మ్రొక్కి లేచి)

మామా ! రమ్ము. ఎల్లి కలహంసకృత్తి పాపాది తీర్థంబులం జూచు కొని త్రివిష్టపకేదారోంకారేశ్వర మహాత్మ్యంబుల నుగ్గడించుకొనుచు దుర్గా దేవికి నమస్కృతులాచరించి యింటికిం బ్రయాణంబగుదము. (మళల నిరు పురు దేవున కెఱఁగి నిష్క్రమింతురు)

## 2. స్థలము- కేశవ గృహాంగణము-

కేశవుఁడు తిన్నెపైఁగూరుచుండును. ప్రవేశము చేతఁ గఱ్ఱ, వీపుపై
మూటతో రామావధానులును, పాత్ర, కొల్లాయగుడ్డ
మూటతో శిష్యుఁడైన పేరిశాస్త్రియు

రామా— (శిష్యునికై తిరిగి విసుగుతో) చెప్పనంటావేమిరా! మీ తండ్రి మృత్యుంజయావధానులు మరీ మరీ చెప్పి వప్పగిస్తే నన్నింత వేధించుతానంటావేమిటోయి!

పేరి—తాతయ్యా! చెప్పు చెప్పు.

రామా—(చెప్పును. శిష్యుఁడనుకరించును)

శ్లో॥ "ఇంద్రియావతః పత్నీవంతం పత్నీవంతమిం
ద్రియావత ఇంద్రియావతపత్నీవంతం, ఇంద్రి
యావత ఇతి ఇంద్రియావతః పత్నీవం
తంగ్రహం గ్రహం పత్నీవంతం పత్నీవంతంగ్రహం"

కేశ—(వీరింజూచి యరుగు డిగ్గి) నమస్కారములు. అవధానులు గారు! తమదే గ్రామమండి? వయోవృద్ధులు. ఎండచేఁ గడుడస్సి వచ్చుచున్నారు.

రామా—అయ్యా! నాదా! నాదా! ఈయూరి కరణంగారి యిల్లెక్కడండీ? ఇంత దాహము దొరుకుతుందనుకుంచాను. ఎక్కడా అంతుచిక్కలేదు.

కేశ—ఆయనగృహమిదియే. ఇచ్చోట విశ్రమింపుఁడు. (అని యాసీనుం జేసి లోనికేగి రెండు వెండిపాత్రలతోఁ జల్లని యుదకము దెచ్చి యిచ్చును)

రామా—(త్రావి) సాంబశివా! మహాప్రభూ! ఇప్పటికి ప్రాణము కుదుటబడ్డది. తమపేరేమిటో చెప్పారు కారూ?

కేశ—నన్ను కేశవుఁడందురు. కరణంబను. తమ నామధేయము?

రామా—రామావధాన్లు. వీఁడు నా ప్రియశిష్యుఁడు. పేరు పేరిశాస్త్రి.

కేశ—

ఉ. పావనమయ్యె మద్గృహము
వంశము ధన్యతఁజెందె బంధుగుల్
గేవలపుణ్యులైరి పరి
కింప నికేమి కొఱంత విప్రవ
ర్యా! విబుధప్రియా! "యురిక
గారు మహాత్ములు" బత్తి పెంపునన్
పావపింలంగ నన్నిటఁ గృ
తార్థుని జేయుమ! పూజలందుచున్.

రామా—మాది గోదావరిజిల్లా రాజోలుతాలూకా పొడగట్లపల్లి శివారు ఈతకోట.

కేశ—అయ్యూరు మాకతిపరిచయమైనది. తమకు సంతానము?

రామా—అయ్యా! ప్రపంచకములో నేరిఁజూచిన సంతానవంతుడుగాని ధనము ధాన్యము నడుగరుగదా! నాకు ఒక్క కుమారుఁడు ముగ్గురు కుమార్తెలు.

కేశ—కుమార్తెలకు వివాహములయినవా?

రామా—పెద్ద కుమార్తెకు పెండ్లి అయింది. కాపురానికెళ్ళి పదేండ్లయింది. ఒక పిల్లా జెల్లా కలిగి దానికాపురం అది ఈడ్చుకొంటూ వున్నది.

కేశ—బాగు మనకంతియా కావలసినది

రామా.—రెండోకూతురు వివాహమై కాపురం చేస్తూంది కాని అల్లుడు నట్టి మొండిముండాకొడుకు, కోపంవచ్చినప్పుడల్లా దాన్ని తాళం వేస్తూవుంటాడు. నాకడుపునకు అంపకోతగా వుంటుంది.

కేశ—పాపము.

పేరి—నా తాతయ్యకు కించిత్ప్రథమకోపము. ఒడలెఱుంగని యహంకారము. అహోరాత్రములు అల్లునకు మర్యాదయులేనా? కాపురాలెట్లు బాగుపడును.

రామా—(ఒక్కింత కినుకతో) ఏమండీ ! మెళ్ళో తాళిబొట్టు కట్టడానికి మాసం దినాలక్రిందటనే చేతిలో వెయ్యిరూపాయలు పోశాను. ఏ పిసినారిపోయినండీ !

పేరి—నీవద్ద 'సంసారము గుట్టు రోగము రట్టు' అన్నమాట లేదు.

రామా—నీవుండనేవున్నావు ప్రబుద్ధుఁడవు. (కేశవునితో) అయ్యా ! అడుగ మఱచాను తమకు సంతానము ?

కేశ—ఒక్కకుమార్తె.

రామా—పుత్రులు?

కేశ—అంత యదృష్టవంతుఁడఁగాను. ఈ బాలికకిప్పు డెనిమిదవ యేఁడు. వరాన్వేషణమునకై చూచుచుంటిని.

రామా—అయ్యా ! అంగుకనిరసే యింతదూరము కాళ్ళీడ్చుకుంచూ రావడం మావూడవపిల్లకట్టదప్పివుంది.

కేశ—అక్కడ సంబంధములు లేవా?

రామా—లేకేమి. దీన్నిపరాయిగా నిద్దామనియోచన.

పేరి—మాదేశమున నొకభయమండీ ! మీవద్ద దాపరికమెందులకు.

సీ॥ మెడను ద్రాడెన్నఁడో ముడివేయునని మాస
మునకు ముందుగ వేయిపోయవలయుఁ
బరిణయంబునఁ గాలుబట్టికడుగ వెండి
చెంబులుగ బళ్ళెంబుఁ జెల్లవలయు
నలుకనాఁడామామయగుదొంచి ముంజేతి
మురుగుల్కుకుపుగట్టి తరలవలయుఁ
బెండ్లియైదుదినముల్ పెట్టిపోతలచే గృ
హము "దివాలా" దీసి యడఁగవలయు
ఎంతసమకూర్చినను సిగ్గొకింత లేక
యరయ లోకనిందకునైన వెఱపుగొనక

యగ్నిసాక్షిగఁగొనిన యర్ధాంగిఁ దుదకు
నేలునో యేలఁడో యల్లుఁడెఱుఁగరాదు॥

రామా—నిజము చెప్పితివి రా!

కేశ—మాదేశమున నంతకంటె మిక్కుటముగనుండె. అయిన నది వరునివిష యము గాదు.

సీ॥ నగలు నాణెములంచు మగని కొంపముంచైన
నను సంచిరూకలన్ రాల్పవలయుఁ
గట్నాలు కానుకల్ గలవంచుఁ బొలముఁ దా
కట్టువ్రాసి ధనంబుఁగూర్పవలయు
ముచ్చటచ్చటలటం చెచ్చుపోకడలఁ బో
యి తినంగ మెతుకులే కేగవలయు
బాలికపయి నిగ్రహాలనిచ్చుతటిఁ గా
ల్చెప్పుదెబ్బలకు నోసింపవలయు
ఇన్నిఁటికి నల్లుఁడోర్చిన నింతశుభము
నెంచక యెమాము, యింటఁదానుంచుకొననో
కూతున త్తింటికంపునో కొదువఁదీర్చి
సందియముగొల్పు సర్వమున్ జనులకిఁదు.

రామా—బాగా కుదిరినది. కేశవమహాత్మా! చల్లకువచ్చి ముంతదాచనేల? మీయింట ఒక పిల్లవాఁడున్నాడుట. ఒక్కసారి చిత్తగించి పిలిపింతురా?

కేశ—ఇవన్నియుఁ బైమాటలు. నామేనల్లునకు మీపిల్లనిచ్చెదరా? మీయట్టి వారి వియ్యరికము మాకు లభించునా? (తనలో) సమయమునకే సమ కూడెను. మా గోవిందునకీతని బాలికనిచ్చి పెండ్లిచేసి కొన్నిచిక్కులు వదలించుకొందు. (ప్రకాశముగా) రామావధానులుగారు! అటు లనే వానిని రప్పించెద. మాగోవిందుఁడు పిన్నవయస్సుగలాఁడు. విద్యావంతుఁడు. (గట్టిగా) అమ్మాయీ! మీబావనిటు రమ్మనుము.

రామా—మీమజ్జవానికి మేనరికముందికదా. నాపిల్లను చేసుకుంచారా?

కేశ—అట్లనెదరేమి? ఎవ్వరుఁ బిల్లనియ్యకున్న నాకుతప్పదు. అదిగాక

చ॥ విపుల దయాంతరంగులరు
వేదపరాయణు లీరు దూరదే
శ(పుఁ బయనంపుఁ గష్టములఁ
జాలగనోర్చి పురంబువారు విం
తపడఁగ నాల్గు గుమ్మములు
దాటి కుతూహలురై తమంతఁ దా
మె పిలిచి పిల్లనిత్తుమన
నెత్తి కుదించెడువాగ లుండిరే!

గోవిం—(ప్రవేశించి) మామా! పిలిచితివి.

పేరి—(గోవిందునిజూచి విరుగఁబడి నవ్వుచు) చబాష్! మాతాతయ్యకు తగిన జామాత దొరకినాడు.

గీ॥ ఔర! చాకిబానంతగూ నహహా! నడక
గనిన గాడిదపులి చందముననె నడచు
మహిని నడ్డిపిల్లకు గూనుమగఁడుదొరకె
ధాతియేకూర్చు గంతకుం దగినబొంత.

కేశ—గోవిందుఁడా! వీరు నిన్ను జూడవలెననఁగాఁ బిలిపించితిని- ఇంక నీ వరుగవచ్చు. (గోవిందుడు నిష్క్రమించును)

రామా—పిల్లవాఁడు బుద్ధిమంతుఁడుగాఁ గనఁబడుచున్నాడు- పిల్లకు ఏమాత్రముసొమ్ము పెట్టుతారంచారు?

కేశ—వరకట్న మేమీయఁగలరు?

రామా—సరే, నలుగురితోఁబాటు మర్యాదకుగాను నాలుగొందలు యిస్తాం. మీర్లు ఒక నాలుగొందలుసొమ్ము పెట్టండి- ఏమంటారు?

కేశ—సమ్మతమే.

రామా—(తనలో) ఇది యిక్కడికి ఫయిసలయింది. (ప్రకాశముగా) అయ్యా! నేను ఊరుచేరి మాయమ్మకి తెల్పి పెళ్ళిప్రయత్నాల్లో యుంచుతాయుంచాము.

పేరి—తాతయ్యా! పెళ్ళిఖర్చులెవరు పెట్టుకొనేటట్లు?

రామా—వారే భరాయించుతారు.

కేశ—బాగుగ వచించిరి. కాని మాదేశాచారము ఉభయఖర్చులు పెండ్లి కూతురువారే భరించెదరు.

రామా—ఇదిమాత్రం అంతబాగున్నదా? ఎవరివి వారే భరాయించుదాము.

పేరి—తాతయ్యా! ఏమి అప్పుడే నిశ్చయము చేసికొంటివా?

కేశ—అన్నగారు! మీశిష్యుండిట్లనుచున్నాండేమి?

పేరి—ఏమనియా! ఈప్రాంతపు సంబంధములు మాకు కొంచెమనుమానము, తీరికగా యోజించుకొనవలెను. ఏమంటివా?

సీ॥ పూజారి గవరయ్య పుత్రికనుం బిల్ల
నిచ్చి మా కాంభొట్లు బిచ్చమెత్తెం
బేరిసెట్టికుమార్తెం బెండ్లాడి మాయూరి
పెద్దకోమటివీపు మొద్దువారె
నంబినాంచారు కన్యను వివాహంబాడి
హితుండొకం డపకీర్తి కేగినాండు
కొయ్య కోటయ్యకొడుకునకు బాలనొసంగి
మా పెద్దకాపు సంపదలు త్రుంగెం
కేశవ మహాత్మ! వినుము మీదేశజనులు
ఇచ్చుకొనినం బుచ్చుకొనినన్ ముచ్చటనక
గ్రుద్దులాట వారికి స్వతసిద్ధమాయెం
గొఱవిం గొనుటేల? తల గోకికొనుటయేల?

కేశ—ఇందు నిజములేకపోలేదు. అయిన నంద అటులనే యుందురా? మీ యూరు మాకు క్రొత్తకాదు.

సీ॥ వేలుకట్నముగుంజి వెతి వెంగళాచార్యుఁ
డేనాఁడు తనభార్య నేలినాఁడు?
ధనము ధాన్యముసంగికొనిన మీచినసుబ్బి
మగని కేమాత్రంబు మంచిదెచ్చెఁ?
గొంపగోడి యమ్ముకొని యిల్లరికమున్న
పేరయ్య మామకే పేరుగూర్చె?
దాచసిచ్చినడబ్బుఁ దస్కరించి యవధా
నియు నల్లునెపుడు మన్నించినాఁడు?
ఉరక వచియింతు వింటింటనొక్క ప్రొయ్యి
గలదు మాయింటఁ గన వేఱొకండు గలదు
సాటువలివేల? భూతల స్వర్గసౌఖ్య
మనుభవించువారలు లేరె? యనఘమతులు.

(ప్రవేశము సిద్ధాంతి చంకఁ బంచాంగము నిడుకొని)

సిద్ధాం—బావా! వీరిదే గ్రామము?

కేశ—రావయ్యా! ఒక్కింత కూరుచుండుము.

సిద్ధాం—(కూర్చుండి) అవధాన్లుగారూ! ఏదీకొంచెము పొడిపిసరు.

కేశ—వీరిది తూర్పుదేశము. మన చినసుబ్బి పుట్టింటివారి యూరు.

సిద్ధాం—బాగు చాలదూరమునుండి వచ్చినారు. ఏంపనిమీద వచ్చారేం?

కేశ—మన గోవిందునకు పిల్లనీయవచ్చినారు.

సిద్ధాం—కల్యాణంఘడియ దొర్లుకువస్తూంది. ముహూర్తము నిశ్చయించకుందురా? (పేరిశాస్త్రితో) పిల్లదాని రూపరేఖలెట్టివోయీ?

పేరి—ఆవిషయము మీకడుగ నక్కరలేదు.

శా॥ చేరల్గన్నులు ; నాస్తినెన్నడుము ; ని
క్షేపంబు కంఠంబు ; వ
య్యారంబుల్నడ ; లిందుబింబము మొగం ;
బా మేనుపైఁ బచ్చ బం
గారుంబ్రోవులు వెట్టవచ్చు ; నిఁకఁ బ
ల్కం దేనెలొల్కున్ ; ముదం
బారన్ బుట్టిన దెల్లముత్యముగు స
త్యంబింత యోజింపుఁడీ.

(రహస్యముగా) కొంచెము నడ్డిమాత్రము గలదు.

సిద్ధాం—దానికేమితే- చంద్రునంతటివానికి గళంకముగలదు-

కేశ—సౌందర్య విషయమా?

ఉ॥ ధారుణి నెవ్వరుందురు య
థావిధివంక యొకింతలేక ; సం
సారికి రూపరేఖల వి
చారణతోఁ బనియుంత లేదిలన్
గౌరవభాజనంబగు గు
ణంబు ప్రధానము దీనికంటె నొం
డారయఁగోము మేము ధన
మంతగ లెక్కడ మెన్నఁడేనియున్.

సిద్ధా—అది యటుండనిండు. (రామావధానితో) మీరు పిల్లవానిని జూచితిరా?

రామా—ఆ- చూచితిని- నాకు నచ్చినట్లేయున్నాడు.

పేరి—తాతయ్యా ! నీవు తొందరపడుచున్నావు- పిల్లవాఁడు నీకు నచ్చితే నేమి నచ్చకున్న నేమి?

శా॥ ప్రారంభమున నత్తగారుగని యా
పైఁ బెండ్లియమ్మాయి క
న్నారంగాంచి మఱందులెల్లరు శిరం
బాడించి పైనూరి కాం
తారత్నంబులు మెచ్చఁగావలయు నీ
నాలెక్క యేముండె న
య్యా! రా! పోవుద మాజ్ఞఁ గైకొని వృథా
యాసంబు లింఁదేటికిన్.

రామా—అవును. ఆడది మెచ్చిందే అందమన్నాడు.

పేరి—అంతేకాదు.

ఉ॥ కల్యపరీక్షఁ జేయుదురు
చానలు; పట్టినపట్టుగాక చా
పల్యముపీడలేరు మగ
వాఁడు శ్రమంపడి తెచ్చెనంచెటుల్
మాల్యము గుత్తెఱుంగరు ప్ర
మోదిత లెన్నఁడుఁగారు కార్య
కల్యము జెందనీయరు రథి
కంబగు గాటఁపుఁ బ్రక్కపోటులన్.

శా॥ చాలన్ శ్రీలుగడించి యాధనదునిన్
శాసింపఁగాఁబోలు ధీ
శాలుండే యువవచ్చు వాదనకు శా
స్త్రజ్ఞుండుగావచ్చు నీ
భూలోకంబున భార్యమాటకెదురై
మోమెత్తి మాటాడునే

యాలోచింపఁగ నయ్యెపప్పుడుక ద

య్యా! యింట నెప్పట్టునన్.

గామా—సిద్ధాంతిగారూ! మాదేశముపోయి జాబునంపెదము. కేశవ మహా శయా! ఆజ్ఞయిప్పింతుగా ?

కేశ—తమరు పెద్దలు. ఏవిషయము త్వరలో తెలియఁజేయుటకు ప్రార్థితులు. మజ్జనాదు లొనర్పుఁడు. భోజన కాలము సమీపించె-

రామ—పేరి—(లోనికి నిష్క్రమింతురు)

సిద్ధాం—బావా! ఉంటాను. (నిష్క్రమించును)

కేశ—మంచిది. (ఆత్మగతము) ఏమిచేయుటకు పాలుపోకున్నది.

శా॥ నారీరత్నము పుట్టుచోఁ బిలిచి క
న్యాదానముం జేతు నం
చౌరా! యాడితిఁగా ప్రమాణవచనం
బా భావదైవంబు నే
పారన్ సాక్ష్యము వేసుకొంటి మటుపై
నర్ధానికిన్ వేఱుగా
నేనీతిన్ నడువంగలాఁడ? నిపు డెం
తే బాలు వాకొండెడిన్.

చ॥ కలుగక కల్గె నొక్క సుత
కాశికి నేగుటచేఁ; బ్రియంబుమై
యిల నడుగుఁచనీయక యా
యెత్తి ముదంబున బెంచి పెద్దజే
సి లలన నిప్పుడిట్టితఱిఁ
జేతులునొవ్వఁగ గూనువాని కె
ట్టు లొసఁగువాఁడనంచు నొక
డొక్కఁగలంచెడు నేమి చేయుదున్.

చ॥ కలిగినవానిఁగాఁ గని స
గౌరవ వంశజుఁగాఁ దలంచి ని
ర్మల గుణవంతుఁగా వెదకి
మంచి వివేకునిగా సురూప సౌ
బలునిగ నెంచి యీయవలె
బాలిక నావిధిగానిచోఁ గటా!
తలఁచితలంచి కన్నతలి
దండ్రులకై వడియేడ్చుఁగా తుదిన్.

మ॥ అకటా! రూపవిలాసిమై పరగు క
న్యం జేతులారం గురూ
పికిఁ గట్టంగనె యన్యథామనము వ్యా
పించుం బతింజూడ దెం
తకుఁ జేకూరును వర్ణసంకరము త
ధ్యంబింత యిద్దాని కో
పక యీపైఁ బితృవర్గమున్ నరకకూ
పంబందు మున్గుంగదా.

చ॥ కనుఁగొన శాస్త్రసమ్మతము
గా నిది యేనొనరించుటింత కం
టెను గొమిరెన్ సురూపికి ఘు
టిల్లఁగఁ జేసినచోఁ నొకింత మే
లనుకొనవచ్చు నట్టితటి
నాడినబాసను దప్పి యొక్కరుం
డౌ నరకలోకవాసుఁడగు
నింతటి దుర్యశ ముండబోదుగా. (నిష్క్రమించును-)

# తృతీయాంకము.

## స్వర్ణపురము.

1 వ స్థలము. కేశవగృహము, కేశవుఁడు నారాయణుఁడు ప్రసంగించుకొనుచుఁ బ్రవేశింతురు. వెనుకనే గోవిందుఁడుండును.

కేశ — నారాయణభట్టుగారు! ఏదీ! మరల తెలవీయండి.

నారా- ఉ. ముచ్చటయంటిరా నగలు

ముందుగ వేయి యొసంగువాఁడ మీ

గిచ్చెదు కట్నమెంతొ వచ్చి

యింపుడి; లేనిచో నూరకిర్వురం

దెచ్చి వివాహముంజరుపఁ

దెల్పెదరా హిత; మప్పుసప్పులే

కెచ్చటనైన నున్న కలి

యేనియు గ్రోలుదు రావధూవరుల్॥

కేశ — లోకానుభవజ్ఞులగాన గలతెలంగు విశదీకరించిరి. కన్యావర శుల్కములు నాకెంతమాత్రము నచ్చవు. నేటివఱకు మనము కనులారఁజూచుచుంటిమిగదా!

సీ॥ మడులు మాన్యములమ్మి మెడఁగట్టుకొనిన యిం

తికొఱకై యొక్కండు తిరిపమెత్తె

ఇల్లువాకిలి వ్రాసియిచ్చి చేఁగొనిన యం

గనకై యొకఁడు మాలకాకియయ్యెఁ

దాతదాచినమల్లెఁ దలకెత్తికొనినట్టి

జాయకై యొక్కండు సన్యసించె

నప్పుసప్పులొనర్చి యేమరించుకొనిన యా
వ్వనితకొక్కఁడు నిందపాలువోయె
పొట్టకుఁదినక కాసుచొప్పునను గూర్చి
పరిణయంబాడిన సతికై యొరఁగె నొకఁడు
పెండ్లి పెండ్లిరా పెదబాబు పెండ్లిగాని
యేటుపయిని భుజంబులు క్రుంగు టరయఁ డొకఁడు.

ఇంకవరశుల్కములవలన నరిష్టములనంతములు వచింప నలవికాదు.

సీ॥ కొడుకు కోడలునైన గుడువలేనితఱి జా
మాత కట్నములతో మడిసెనొకఁడు
తా లేవలేనట్టి వేళనల్లునిసాగ
దీసి ప్రాణము ధారవోసెనొకఁడు
జామాతయులుకదీర్పఁగ ఋణాలొనరించి
పేరుప్రతిష్ఠలన్ వీడెనొకఁడు
తానీరుద్రావ పాత్రయులేకయల్లున
కొకవెండిచెంబిచ్చి యొరగె నొకఁడు
కూతునకు జిక్కుమగఁడన్న కౌతుకంబు
తనకు నల్లుఁడుండెనని మోదంబుమిగుల
మామపడెడుపాటులు పితామహునకెఱుక
యల్లుఁడనఁగఁబందిరి గుంజకైనఁగలదు.

నారా — ఆర్యవరా! ఇదియంతయు విద్యాధికులలోనె యున్నది. వారినుండియే పామరులకుగూడనంటువ్యాధిగఁ బ్రాకుచున్నది.

శా॥ వారింజూచినవీరు; వీరిఁగని యా
వ్వారిద్ధరామండలిం
గారాల్ నూరుచుఁ బేర్ప్రతిష్ఠలకు తా
కట్టుంచి యైనన్ శిరం

బూరం బెండిలి జేతురింతె యటుపై
నూహించఁ డొక్కండు క
న్నారం జేలికిఁ జెప్పదొప్ప నిడుచు
న్నామంచు జామాతకున్?

కేళ— ధనవంతులేమి? నిఱుపేదలేమి? ముద్దులుమురిపెంబులు నుండుఁ గదా కావున

మ॥ తనశక్తిం బరశక్తిఁ జూచుకొని యుం
తన్ గౌరవార్హంబుగాఁ
జనుటల్ శ్రేయము పెండ్లియైదుదినముల్;
సామర్థ్యమా లేకయుం
టను, భాగ్యంబును లేక యుంటను గడున్
డంబంబులం బోవు టా
ప్పని కార్యంబదివీడఁగాఁదగు లస
ద్బాంధవ్య మేపారఁగన్.

ఇట్లంటినని మీరు నిరుత్సాహులు కాఁజనదు.

ఉ॥ ఇంటికినున్న పుష్టి యని
రెంతయు నొంటికిఁదిన్న పుష్టి యీ
రెంటికిఁ గొంత లేదు; పయి
శ్రీహరిసత్కరుణా ప్రవృష్టిచేఁ
గంటిని గన్నమానికముఁ
గంటికి తెప్పగఁ జూచుకొంటి మీ
వంటి కులీను నింటఁ బడ
వైచెఁగ నుంటిఁగొఱంతయుండునా?

మారోపినయంతవట్టు వరుని సత్కరించెదము. అందు లోటుపాటు లాక్షించు కయు రానీయము!

ఉ॥ పట్టుదుకూలముల్ రజత
పాత్రలుఁ బళ్లెర మొందు శక్తి యు
న్నట్టులు సంచి కట్నమిడి
యైదుదినంబులుఁ బెండ్లిజేతు మా
పట్టున ముచ్చటచ్చట ల
పారముగాఁ గనువారమింక మీ
పట్టియ యద్ది; యింత కల
వాగని చేసికుచుంటి భూసురా!

గోవిం—(ముందునవచ్చి తనలో) ముంజేతి కంకణమున కద్దమేటికి? అన్ని యుఁదెలియవచ్చె. నిన్నవచ్చిన రామావధానికూతు నాకిచ్చి ముడి పెట్టి యీ నారాయణభట్టుగారి కుమారునకు తన కూతునిచ్చి వైభవంబుగ వివాహంబుఁ జేయనిశ్చయించె. ఇంక నూరకొనరాదు.

నాగా—మేముమాత్రము మీ గౌరవమునకుఁ గొదువరానిత్తుమా! శుభస్య శీఘ్రమ్మనిరి. సుహూర్తము త్వరలో నిశ్చయించుట శ్రేయోదాయకము.

కేశ—వైశాఖమాసము రానున్నదికదా!

గోవిం—(కేశవుని సమీపించి) మామా! నీకన్నెకు తగినవరుని విచారించితివా?

కేశ—నీకు రామావధానులుగారి బాలిక నొసంగుదురు.

గోవిం—చక్కఁగా వచించితివి, ఇప్పట్టున దలంచినదంతయుఁ దధ్యమారెను.

శా॥ అన్యాయం బిటుచేయుఁగాఁ దగదు; నీ
వానాఁడు వారాణసిన్
మాన్యుల్ మెచ్చఁగ బాసఁజేసి యిది యే
మర్యాద యిప్పట్టునన్

గన్యారత్నము పుట్టుచోఁ బిలిచి నా
కాల్గడ్గుటేమాయె? న్యా
యాన్యాయంబులనంగ నిట్టివియ? మా
మా! లోకులాలింపరే!

కేశ—గోవిందుఁడా! ఇందన్యాయమేమి? ఎవరేనియు శాస్త్రసమ్మతముగా వర్తించుట శ్లాఘనీయంబు.

గీ॥ మంచిచెడ్డ విచారించి మసలుటొప్పు
శాస్త్రసమ్మతమంట సజ్జనహితంబు
కన్నెనిమ్ము మిమ్మనినంత గడఁగుటెట్లు?
సుతను నూతఁగూల్చి లోతుఁజూచువారె!

గోవిం—ఇత్తఱి నిది శాస్త్రసమ్మతమా? ఇచ్చిన వాగ్దానము నప్పిచరించుట సజ్జనహితంబా?

గీ॥ చారుమణి భూషితంబై యొసంగుచున్నఁ
బన్నగము ప్రాణికోటికి వర్జితంబు
విపుల విద్యాసుగంధతన్ వెలయుచున్న
నన్నృతవాదిపరిత్యాజ్యుఁడౌనుమామ!

చ. ఎటులును పెద్దవాఁడవు మ
హీస్థలి ధర్మవిదుండ వెంచుఁబెట్టెదె
ప్పాటయును నాడితప్పాటయుఁ
బోలవు సజ్జనలక్షణంబుగా
దటువయిఁ జెంతజేర ద్రోఁకఁ
డైనను జేలవమాదువింక న
క్కటకట! పేరుగోల్పడెదు
కన్న నరుల్ కలకాలమెన్నరే.

కేశ — అంతియుకాని పైగతి విచారించవు. మేనరికము చేయుటయే యంత శ్రేయస్కరముకాదు. దూరదేశ సంబంధబాంధవ్యములే యుత్తమములు. ఇప్పుడు నీయనుమతిచొప్పున బాలికనిచ్చి వివాహమొనర్చెదననుకొనుము. ముందువచ్చు కష్టనిష్ఠురములు నీకింకను దెలియవు పసివాఁడవు.

గోవిం — (నవ్వుచు) మామా! ఏమాకష్ట నిష్ఠురములు?

కేశ — అటులడుగుము.

గీ॥ ముక్కుపచ్చలారనియట్టి ముద్దుకన్నె
మానికముఁ గురూపికి నిచ్చి లేనివశము
వయసువచ్చినచో నద్ది వానితోడఁ
గాపుర మొనర్చునే? మంటఁగలుపుఁగాని.

గోవిం — (నవ్వుచు) ఇదియాసంశయము. నేను మొదటినుండియు ననుమానించుచుంటి. మామా! ఈవు వచించినది యథార్థమే యగుఁగాని నామనంబునకంత నచ్చుటలేదు. ఏమంటివా?

సీ. కుసుమబాణునకీయ గుణములేనట్టిచోఁ
గులటయౌచుఁ గురూపిఁ గూడియుండు
బలునికిచ్చిన బుద్ధిబలము జాలనిచో బుం
శ్చలియౌచు దుర్బలున్ గలిసిమెలఁగు
ధనశాలికిడిన నీతిని గోల్పడినచో స్వై
రిణియౌచు నిరుపేదఁగొని చరించు
బుధునకిచ్చిన జ్ఞానమున్ వీడినచోఁ బాంసు
లై కానికులుని వెన్నంటితిరుగుఁ
బురుషునకు నితంబినికతంబుననె కలుగు
మంచిమో చెడ్డయో ధరామండలమున
రూపమేమిచేయు గుణాలయేపు గుదుర
బుడకలనుబోవుఁ బుట్టెను బుట్టుబుద్ధి.

సీ॥ సుదతి సుశీలయేన్ శ్వశ్రూషఁగావించి
స్వర్గముంగొనుఁ గుంటివాని క్రిడిన
అతివసద్గుణియోసిఁ బతిభక్తి నడిచి స
ద్గతిఁబొందు బధిరహస్తమును గొనిన
చాన జ్ఞానవతియేన్ సన్నుతిన్ మన్నించి
మోక్షముంగొను భర్త మూగయైన
ఇంతి మేల్బంతియౌనేనిఁ బూజలుసల్పి
యశముగాంచును మగం డంధుడైన
నాతి నీతిగల్గినదేనిఁ బ్రీతిఁ బగగి
చెలఁగుఁ బ్రాణనాథుఁడు దుష్టచిత్తుఁడయిన
వసుధ సౌందర్యవతియైన ఫలమదేమి?
గుణములో నొకించుకయంత కుంటువడఁగ.

కేశ — ఈవెన్నియైనఁ జెప్పుము. నాకు రుచించుటలేదు. గోవిందుఁడా ఇందులకింత పట్టుదలయేలః

ఉ॥ పిన్నటనాఁట నుండియును
బెంచియు బెద్దయొనర్చి యుంటచే
నిన్నొక యింటివానినిగ
నెయ్యమెలర్పఁగఁ జేతు మున్న నా
కన్నియ నేని చేతనిడఁ
గా నటుపై భయమేలనీకు మే
ళ్ళన్నియుఁ గూర్తుఁ గాదనకు
మా! ననుగైకొనుమా! శుభంబగున్.

గోవిం—మామా! (పీటవెట్టుక కూరుచుండి) ఆరునూరైన నూరారైన నీవే పిల్లనీయవలెను. నేనే చేసికొనవలయు.

శేష—'పిచ్చికుదిరింది; రోకలిం దలకుచుట్టమన్నాడట' ఎన్నఁడో తొమ్మిది పదియేండ్లక్రిందట కాశిలో మాటవరుసకు పిల్లనిచ్చెదననినందులకా యింతయాగడము. కార్యము నిర్వహించుకొనుపట్ల ననృతంబుల నాడగాదా! అందును నిది వివాహతరుణంబు. అనినమాటను గాదనినచో దోషమేమి? ఏను యోజింపవలసినది వరలక్షణంబు. (కినుకతో)

శా. ఈడున్జోడు దలంచకీ పరిణయం
బేఁజేసి బాలామణిన్
గోడుం బెట్టఁగఁజాల; నిశ్చయమిదే
గోవిందుఁడా! యింక మా
ఆడంబోకుము; మేనయల్లుఁడవటం
చాశించి యేకన్యకా
చూడారత్నమునైన దెచ్చిమెడకుం
జుట్టన్ బ్రయత్నించితిన్

కం. కాదేని నాదుపలుకున్
లోఁదలఁపఁగఁ జాలవేని నుడివెదఁగుత్రా
నీదుహిత యింక వసుధన్
గాదువివాహంబు నీకు గడపెదవిట్టుల్.

గోవిం—(కోపముతో) మామా? స్వార్థపరుఁడవు మోసగాఁడవు. అనృతవాదివి ఏరున్దాటి తెప్పఁదగులబెట్టుమానిసివి.

మ. అనృతంబాడుట కింతజంకవహహా;
యాశ్చర్య్య మా కాశిఁజే
సినబాసన్ జవదాటిపోవుటకు నీ
చేఁ గా దిఁకంజూడు! క

న్నను మర్యాదగనిత్తువా? శుభమగున్
లేదా విచారించు కొ
మ్మనఘా! కయ్యముకద్దు కాఁ గలుగు కా
ర్యంబెల్ల విఘ్నంబగున్.

ఊరిపెద్దలరావించి పంచాయతీసభలో నీయకృత్యమునకు ప్రతిక్రియ గావించెద.

కేశ—నిన్నటిదినంబుననే యీ వింతవాఁడవగుదువని వారికిఁదెలియవచ్చె.

గోవిం- ఔరా! ఎంతవాఁడవు!

ఉ॥ ఏయెడనైన నీదుగుణ
మిట్టిదె; నేఁటికిఁదెల్లమాయెఁ బం
చాయతిఁ గూర్చినాఁడ వికఁ
జాలెదవల్లుఁడు పెద్దవాఁడటం
చే యయ నిన్ను నన్నెఱుఁగఁ
డిప్పరి? జూచెదఁగాక నెల్లి యా
ధీయుతులన్ వచింపుమను
తేటపడున్ మనగౌరవంబులున్.

(నిష్క్రమింపును)

(తెరపడును.)

---

2 స్థలము. పంచాయతీసభ, అందఱు తమతమ యుచితాసనముల గూర్చుందురు. ద్వారముకడ ద్వారపాలకుఁడు నిలుచుండును.

అగ్రాసనాధిపతి—సుబ్బయ్య.

ద్వార—సుబ్బయ్యగారూ! (అని ముమ్మాఱు కేక వేయును)

సుబ్బ—ఓయ్ ఓయ్ (ప్రవేశించి యెదుట నిలుచుండును)

అగ్రా—సోమయ్య

ద్వార—సోమయ్యగారూ! (అనిముమ్మారు కేక వేయును)

సోమ—నేనే, నేనే- (ప్రవేశించి యెదుట నిలువంబడును)

అగ్రా—ఏమిటయ్యా! మీయిరువురి వివాదము?

సుబ్బ—అయ్యా! మాబఱ్ఱెపడ్డ తనదొడ్డిలోపడ్డదని దానికాలు విరుగగొట్టినాడు. ఎన్నిచికిత్సలుచేసినా కుదురలేదు. నేటిపుదయం అది ప్రాణమువిడిచి మాపాలేరు పాలయింది.

అగ్రా—(సోమయ్యంజూచి) నిజమంతియేకద-

సోమ—అదిపెరడులో ప్రవేశించి పాదులన్నీ పాడుజేసింది. పైగా మా దానీది వెంకికాలుత్రొక్కిపోయింది. ఆకోపంమీద గాడిపొయిదగ్గిర వున్నమడకఱ్ఱపుచ్చుకొని ఒక్కవ్రేటేసితి.

అగ్రా—మంచిపనిచేసితివి. దానిజీవము దీసితివి. మీవెంకికాలు నిమ్మళించెనా?

సోమ—ఆ:

అగ్రా—అటులైన ఆయనకాపడ్డవెల నిచ్చుకొనుము పొండు.

సోమ—చిత్తము. (నిష్క్రమింతురు).

అగ్రా—సత్యనారాయణ

ద్వార—సత్యనారాయణంగారూ! (అనిముమ్మారుకేక వేయును)

సత్య—(ప్రవేశించును)

అగ్రా—ఆంజనేయులు.

ద్వార—ఆంజనేయులుగారు (అనిముమ్మారుకేక వేయును)

ఆంజ—(ప్రవేశము)

సత్య—దేవునియెదుట ప్రమాణముచేసి చెప్పుచుంటి. వయసునలువది తండ్రిప్రకాశరావు. వృత్తిజరాయితి. బ్రాహ్మణులము. నివాసస్థలముస్వర్ణపురము. నేటికిరెండుదినములక్రిందట ఆంజనేయులుగారు మాయింటిమీదకు కుమ్మక్కుతీసుకొనివచ్చి నన్నుతన్నించినారు.

అగ్రా—ఆంజనేయులూ! నీకు సందియములున్న దర్కింపుము

ఆంజ.—చిత్తము (సత్యనారాయణతో) ఎన్నవజామున మీ యింటిమీదకు వచ్చినది?

సత్య—పగలు రెండవజామున

ఆంజ—అప్పుడునీవెచ్చటనుంటివి?

సత్య—పెయ్య గడ్డికై యూరివెలుపలి దొడ్డివద్దకువెళ్ళియుంటిని.

ఆంజ—అట్లయిన ఇంటివద్దనిన్ను తన్నించుటకు ఎట్లువీలుపడును?

సత్య—దొడ్డివద్ద నేతన్నించితివి.

ఆంజ—ఇప్పుడు ఇంటివద్దఅంటివే

సత్య—కాదు కాదు, అచ్చట నే. సాక్షులుకూడగలరు.

అ(గా—ఇచ్చటకువచ్చినారా?

సత్య—రాలేదు.

అ(గా—అటులయిన సాక్షులను దీసికొని యిరువురు నేటికయిదవనాడు సిద్ధముగండు.

సత్య—ఆంజ—చిత్తము. (నిష్క్రమింతురు)

అ(గా—గోవిందుడు

ద్వార—గోవిందుడు గారూ (అనిముమ్మారు కేక వేయును)

గోవిం—(ప్రవేశించి యెదుటనిలువబడును)

అ(గా—కేశవులుగారు

ద్వార—కేశవులుగారూ (ముమ్మారు కేక వేయును)

కేశ—(ప్రవేశించును)

అ(గా—ఇటునాసీనులగుడు (ఆసనమిచ్చును)

కేశ—(కూరుచుండును)

అ(గా—మామయల్లుండ్రకు రాజికుదిరినదా?

కేశ—ఏవిధముగ?

అ(గా—గోవిందుడా! నీపట్టుదలయేమి?

గోవిం—అయ్యా! కాశికి నన్ను వెంటనిడుకొని తనకు కన్యకలిగినచో నాకిచ్చి వివాహమొనర్తునని శ్రీభావనారాయణుఁడు సాక్షిగాఁగ వాగ్దానమిచ్చెను. ఇవ్విధంబుగ జేయునని విశ్వాసము గలిగి నిశ్చయించుకొనినపిదపనే యద్దేవుని బ్రార్థించితి. ఆపైనఁగదా! ఈయయ్యకు కొమరితకలుగుట!

అగ్రా—(కేశవునితో) మీరేమందురు?

కేశ—ఉ. ఎట్టును నాహితంబుగొనఁ
డీతఁడొకించుక మంచివాఁడు తో
బుట్టుకుమారుఁడంచు జెడి
పోవునటంచును జాలిబూని నేఁ
బట్టుక యూఁగులాడెద వి
వివాహము జేయఁగ వేఱొకర్తె ని
ష్పట్టున గానిచోనదియు
వమ్మగునంచు వచించితింగదున్.

గోవిం—నాకుహితంబైన కన్నియనీయక వేఱొకళ్ళకెంగట్టఁగఁ దనంత వానికి ధర్మమా?

అగ్రా—అదియెట్టిమాట! నీకీపిల్ల యిష్టమయినసరియా? పిల్ల దానికీవు రుచించవలదా?

గోవిం–శా. ప్రాణేశుండు గురూపుఁడైన నతి ము
ర్మార్గుండుగానైన పూ
బాణుండైన సతీలలామకతఁడే
వంద్యుండు దైవంబు న
జ్ఞానధ్వాంతవిభాకరుండు గురుఁడిం
కంజుట్టముం బక్కవాఁ
గానీ యేటికి నేతిబీరపలుకుల్
కల్లోలము ల్గల్గెడున్.

అగ్రా—పెండ్లియైనచో మగఁడెట్టివాఁడైనను మగువకు తప్పదు. ఎఱిఁగి యెఱింగి కూఁతుం జేతులార కురూపికిం గట్టిపెట్టుదురా?

గోవిం—ఈ రూపము నాకు నేఁడే వచ్చినదియా?

శా. ఆనాఁ డేమని బాసఁ జేసె? నిటులౌ
నంచున్ విచారించెఁడే?
తానా! యొక్కరీకిన్ వచింపఁగలఁడేం
తల్ మీరు చెప్పంగ నే
లా? నా రాయఁడుమండె సాక్షిగఁబయిన్
న్యాయంబ గెల్పొందు; నా
గా! నన్నాదని యేదకిచ్చుఁ దన క
న్యం; జూతుఁగా కత్తఱిన్.

అగ్రా—కేశవమహాత్మా! అల్లుఁడు పెంకెపట్టు బట్టినాఁడు. మీరాతే యను వెఱిఁగి నడచుకొనిన హితంబు. అదియుంగాక గోవిందుఁడును గూటికిం గుష్ఠకుం గలవాఁడు. శాస్త్రవిగఁడు, సియింటు నెయ్యుండి సేవకింగాలికిం బ్రయోజనకారియగును. ఇట్లు చెప్పినవాని కిని చూసెఁడు. మీరును సత్యవాక్పరిపాలనా ధురీణులగుదురు. గోటిలోఁబోవుదానికి గొడ్డళ్ళఁ జిమ్మనేల? మఱియు

"ఇనుము విఱిగె నేసి యినుమూఁడుమార్లు
కాచి యతుక నేర్చు కమ్మఱీఁడు
మనసు విఱిగెనేని మఱియంట నేర్చునా?"

అను బుధోక్తి మీక నుభవనీయంబు.

కేశ—అగ్రాసనాధిపా! లేక లేక యొక్కకుమారిత కలిగె. దానిం గ్రిందదించక చేతులమీదం బెంచితి. కాళ్ళకేగిన కాళ్ళబాధ నేఁటివఱకుం దీరలేదు. అట్టిచో వెనుకముందు లారయక యీతని కేవిధినొసంగి వివాహముం గావించెద? నేను పడిన యిక్కట్లకిదియేనా ప్రతిఫలంబు?

గోవిం—నీ వేయిదుమ్ములగుడిచిన నాకేమి? ఏవిధంబుననైన దప్పించుకొన
లేవు. నావైపు సాక్షులుగలరనియైనఁ దలంపవు.

కేశ—గోవిందుఁడా! మాటిమాటికి సాక్షులున్నారు సాక్షులున్నారను
చుందువు. వారెవ్వరో యొక్కింతయెఱిఁగింపుము.

గోవిం—ఔరా! అంతమఱపునకువచ్చిరా?

సీ. ఎఱుఁగవే వాగ్దానమెవ్వానికడఁ జేసి
నది భావదేవుఁడే యరయసాక్షి
తెలియవే యాచెంతఁ గల ఘనుండెవ్వరె
నది విరూపాక్షుండె యరయసాక్షి
తలఁపవే నీవాడు పలుకులెవ్వారు వి
న్నది యానాఁటితరులే యరయసాక్షి
ఎంచవే నీరాక నెవరు ద్వారమునఁ గ
న్నది యావిమానంబె యరయసాక్షి
మానుఁ! చింతింపవే నాఁడు మునుల నెవరు
గనిన దీ మహామహుఁ డత్రిముని యె సాక్షి
పూసగుచ్చిన క్లోను చెప్పినదియెల్ల
సత్యమో కాదొ సాక్షి నీస్వాన్తమిందు.

కేశ—ఇంక నేమి వారిని వారిని దెచ్చికొనియే కల యదార్థంబు నిరూపించు
కొనుము.

శా॥ ఔరా! సాక్ష్యముపల్కుటా! యుగమువా
రంబిందు విచ్చేయుటా!
శూలిం దెచ్చుటయా! తపోనిధి మునిం
దండ్రి యే తెంచుటా!
మేలీపల్కులు చాలుఁ బొమ్మపుడె నిన్
బిల్పించెదంగాక; నా

బాలన్నీకిడ; నంతదన్క నోనరిం
పన్బోను నీపెండ్లియున్.

అగ్రా—అటులొనరించుటయే యుత్తమము.

1 సభ్యు—మాకునదియె సమ్మతము

2 సభ్యు—మీ అభిప్రాయమే నా యభిప్రాయం.

గోవిం—మీరందులకే యంగీకరించితిరా? మామనుసత్యపథమునకు ద్రిప్ప జాలరే? ఏమి మీపెద్దతికము! ఏమిమీ న్యాయసంస్థాపనము- ఔరా!

కం॥ శిరమున్ గడ్డము నెఱసిన
ధరామరుండనుచు మామతలంపుంగని యీ
కరణిం దీరుపు దిద్దిరి
యగరే! మొట్టికులపెద్దలయ్యా! మీరల్.

మహార్యశ్రేణులారా!

కం॥ తినయ నోసంగెదనని త
ప్పినవాఁడును నింటియాడుబిడ్డ వలువ లిం
క నగల్ ద్రుచ్చిలువాఁడును
మనినన్ భువిఁ జెల్లినట్టిమనుజుఁడు గనుఁడీ.

మామా! ఏనుపేర్కొనిన సాక్షులనక్లే తెచ్చుకొనువాఁడను. ఈ వాగ్దత్తమయిన నిలుపుకొందువా?

కేశ—ఓయీ! ఇదినాలుకా తొట్టిమట్టయా? వారేవచ్చి మహపట్టణమున సాక్ష్యముం బలికిరేని మమ్మాత్రటికి నాయందముల ప్రోవు నానుగుణ ములరాశి నాప్రాణప్రదంబ నాముద్దుబాలిక నీకమొసంగి పరిణయ మొనర్చువాఁడను. నిజము నిజము.

గోవిం-శా. పిన్నల్ పెద్దలు వింటిరే? యిపుడ వే
వే గాశి కేనేగి యా

పన్నానీకశరణ్యు శ్రీశు సదయున్
ప్రార్థించి తోడ్తెచ్చుకొం
దు న్నా వెంటనె యంతదక్క సుత క
న్యన్ గూర్పఁగానీఁక యీ
యన్నన్నిల్పుఁడి యద్దికాదనఁ గులం
బందున్ బహింబెట్టుఁడీ.

అగ్రా—అందులకేమి తగిన కట్టుబాటు లొనర్చెదను. ఒక్కయేడాది గడు విచ్చెదము. పోయిరమ్ము

గోవిం—(కేశవునితో)

కం. మామా! భద్రము సత్యం
బీమాటను దప్పదేమొ! యీలోనన్ బా
లామణి పెండిలిఁ జేయుదు
వేమో! పులిమీఁదఁ బుట్రయే యౌనుజుమీ.

యవనిక పడును. (నిష్క్ర—౧.)

# చతుర్థాంకము.

1 స్థలము. కాశీనగరప్రాంతము. ప్రవేశము గోవిందుఁడు ప్రయాణాయాసముచే.

గోవిం—(మాటఁగ్రిందఁబెట్టి యుస్సురని)

కం. నేఁటికి మదనుభవంబున
కేటముగా వచ్చెఁ గాశికేగినవాఁడుం
గాటికి నేగినవాఁడుం
బాటింపఁగ నొక్కటన్నమాట ధరిత్రిన్.

పుణ్యనదీనదంబులు దాఁటి యనేకజనపదంబులు గడచి యెండకెండి వానకుందడిసి యేకాకినై పవలనక రేలనక ప్రయాణంబొనరించుచు జఠరాగ్ని ప్రజ్వరిల్లుతఱి నేవృక్షచ్ఛాయనేని వండుకొనుచు వండినదాన సగంబ భుజించుచు నేగుంటకంటికగుపడిన మనంబు పరితపింపఁగ నింతనీరు గ్రోలుచు నందందు కుసుమఫలభారంబై యొప్పారు సుందర తరుబృందములతో వెలయు వనంబులఁ దపోనిష్ఠాగరిష్ఠులై యుండు మహర్షుల సందర్శనంబుఁ బొనరించికొనుచు, నగమ్యంబై కాఱు చీఁకటులం గ్రమ్ము ఘోరారణ్యంబులం జనుచుండఁ బొదరిండ్లమఱుఁగున బొంచియున్న సింహంబుల గర్జితంబులకోడి, వృక్షశాఖలం దొండంబులంబట్టి పెటపెట విఱచు కరీంద్రముల ఘీంకారంబులకు జంకి వ్యాఘ్రభల్లూకాద్యనేక వనమృగారావంబులకు భయంబుజెంది యందందు శిరంబు దాచుకొనుచు నెట్టకేలకు 'బ్రదుకుజీవుఁడా' యని నేఁటికీ వారణాసీ నగరప్రాంతమునఁబడితి. ఎందులకీకష్టంబులు. ఏటికింతప్రయాణాయాసము? ఏఫలాపేక్షకై యిట్టి సాహసకృత్యంబులు? అక్కటా!

చ. అమరుగఁ ద్రోవ వెచ్చమున
కై కయికొన్నది పూర్ణమాయె; కూ
డమరదు నేఁడు పట్టెడుద
యంబుననుండి; మొదల్ కృశించెఁ ; బెం
డ్లము కొఱకెన్ని పాటులు ప
డన్ వలె నక్కట! బుద్బుదంపు జీ
వమని యెఱింగియున్ మనము
పట్టఁగరా దల మోహమెట్టిదో!

సంసారిసుఖియా? సన్యాసిసుఖియా? (యోజించి) సన్న్యాసియే సుఖియనితోచుచున్నది-

చ. ఇది కలదంచుఁ గల్గదిది
యింటనటంచును జీకుఁజింత లే
దది ; గృహమా? కనన్ గృహిణి
యా? పురసత్రమునందు భోజనం
బాదవు; మఠంబున న్నిదుర
యుండుఁ గొఱంత యె? కద్పులోని నీ
ర్కుదలక దేవయాత్ర చనుఁ
గంజదళాక్షుని కీర్తనంబు చేన్.

సంసారికిట్లు గాదే!

ఉ. ప్రొద్దున బొన్నునుండి యాటు
పోర్లినదాదిగ నర్ధరాత్రిపై
సద్దుమడంగు దాఁక, నిలు
జక్కనిదన్ వలెఁ బాడిపంటలున్

దిద్దుకోఁగావలెం గలవు
తీర్పఁగలట్టివి రాజకార్య సం
సిద్ధులు జన్మమృత్యువుల
చే సుఖదుఃఖములెన్నొ యుండెడిన్.

నాకేదియుఁ బాలుపోకున్నది. సంసారమందును సుఖంబులున్నవి. మేనఁ బ్రాణంబులున్నన్ని దినాలుఁ గష్ట సుఖంబులకందరైయెప్పు జాయయే సౌఖ్యములవోంతి. తన తరంబులవారిం దరింపంజేయ సమర్థుండగు కుమారుండె సంతోషప్రదుండు. పరమోత్తమంబైన దానంబున కాస్పదంబగు కన్యకారత్నంబె సుఖంబులప్రోవు- ఇంకనరుండు శ్రీహరి పాదారవింద సేవాపరతంత్రుఁడుగాడనియా? ఎందఱో సంసారమందు కుమ్మరిపురువుగతి సంచరించుచు కృతార్థులగుట లేదు- అదివిచారించియే మామతో గుద్దులాట కియ్యకొంటి.

గీ॥ పరిణయంబనిన భుజముల్ పైకిపొంగ
జాయ యనినంత గంపెడాసలు జనించెఁ
గాశికిట్టి కాళ్ళీడ్పు రాకలు ఘటించె
హృదయమున కొంకింతయు శాంతి కుదురదాయె.

ఇప్పట్టున నవశ్యాచరణీయం బెయ్యది ?

మ॥ భగవానుండన భక్తవత్సలుఁడు న
ద్భద్రానుసంధాయి యా
ర్తగణత్రాణపరాయణుండతని సం
దర్శింపఁగా నిందె ధ్యా
న గరిష్ఠంబున నుంట మేల? యెదుటన్
ప్రార్థించి రారమ్మటం
చుఁ గడున్ గంద్రతనంబు జేయుదున? యి
చ్చో నేమిచేయందగున్.

ఇదిగో - ముందత్రిమహర్షిం జూచుకొని, తరువాత శ్రీభావనారాయణాంతికమునకేగి, సీటవెట్టుక కూరుచుండెద. అప్పుడుండును గాఁగల కార్యక్రమము.

ఉ. భక్తుఁడు గెల్చువాఁడో భగ
వంతుఁడు గెల్చెడివాఁడో చూతు నా
శక్తికొలంది; మున్నిచట
జ్ఞానవిదుండగు నత్రిమౌని స
ద్వ్యక్తుని విష్ణుభక్త జన
వంద్యుని మాన్యు బహూకరించెదన్
యుక్తముగా; నతండె సమ
యోచిత కార్యము సంఘటించెడిన్.

(తెరయెత్తఁబడును. అత్రిముని తపోగరిష్ఠుండై యుండును. గోవిందుఁడు తనలో)

ఉ. ఈసుగుణుండె యత్రిముని
యీశుఁడె విష్ణుపదారవింద పూ
జాసుకృతాత్మకుం డితఁడె
సర్వజగన్నుత పాత్రుఁ డితఁడే
భాసుర కీర్తనీయుఁడు త
పఃపరతంత్రుఁ డితండె చూడ రెం
డేసితిఁ గండ్లుచాలవు మ
హీస్థలి ధన్యుఁడనైతిఁ బుణ్యుఁడన్.

(సమీపించి) మునికులతిలకా! తపోగరిష్ఠా! జ్ఞానధనా! సర్వశాస్త్ర సంపన్నా! నమస్కారములు.

అత్రి—(కనులువిప్పి) ఈవెవఁడవు?

గోవిం—బ్రాహ్మణుఁడ. బ్రహ్మచారుఁడను.

అత్రి—ఏదేశము?

గోవిం—ఆంధ్రదేశము

అత్రి—ఏయూరు?

గోవిం—స్వర్ణపురము

అత్రి—గోష్ఠీవనమా? (వెలవెలబోయి తనలో) శ్రీహరికై వచ్చినవాఁడు గాఁడుగదా!

గోవిం—మహానుభావా! గోష్ఠీవనంబె.

అత్రి—మా కాశీపట్టణంబునకు యాత్రార్థమై వచ్చితివా?

గోవిం—అందులకై రాలేదు. (అర్ధోక్తితో)

అత్రి—శాస్త్రాభ్యాసమునకై చనుదెంచితివా?

గోవిం—అందులకుం గాదు.

అత్రి—మఱియెందులకు?

గోవిం—మా పురంబున సాక్ష్యమిచ్చుటకు భావదేవుని గొనిపోవఁ బుత్తెంచితిని.

అత్రి—(ఆశ్చర్యముతో) ఏమి? ఈవా! ఏమంటివి?

మ. వడుగా! యెక్కడి గూని బాపఁడవు వ
హ్వారే! రమాకాంతుఁడె
క్కడ? సాక్ష్యంబది యెట్టిదక్కజముగాఁ
గాశిం బ్రవేశించి యె
క్కడి వీపల్కులు? విన్నవారు నగరా?
కన్నయ్యలున్ విశ్వసిం
చెదువారా? హరి వెంటవచ్చెడినె? యి
స్సీ! మాటలన్ మూటలన్.

గోవిం — వెంటఁగొంపోవుటకే వచ్చితిని.

అత్రి — ఎట్లుగొంపోయెదవు?

గోవిం — పిలుచుకొని.

అత్రి - చం. భళిభళి? యెట్టిమాట! భగ
వంతుఁడనంగనె చేతఁజెంబుగొం
చిల భుజియింపఁగాఁ బరువు
లెత్తుక వచ్చెడి పేద బాపఁడా?
యలిగినసాగదీసి యర
యం గొనివచ్చుట కింటియల్లుఁడా?
చులుకన యెంత చేసితివి
చోద్యము చూచెదఁగాక పోయిరా.

గోవిం — (చేతులు మోడ్చి) మునిచంద్రమా! శ్రీహరి చరణారవిందమకరంద పానధురీణులరై నిత్యసత్యభక్తాగ్రేసరులరై ప్రత్యక్ష రమాకాంత సందర్శనసమహాభాగ్య... లోక విఖ్యాతి గొనిన మీరే యీ కరణి మదువుచుంటిరేమి? మనసుకుదిరిన నయ్యది యసాధ్యమా?

సీ. మూల! మూలా! యంచు మొఱ వెట్టుకరికమ్మ
వంకఁజుట్టమ యేమి? బమ్మతండ్రి
అనిశముంగొలుచు ప్రహ్లాదున కబ్బత
ట్టునబంధువా? విరాట్పూరుషుండు
ఆర్తుఁడై ధ్యానించు నంబరీషునకు మే
నత్తకుమారుఁడా? యచ్యుతుండు
తనుసదా భజియించుఘనుఁడైన ధృవునకున్
మామచుట్టరికమా మాధవుండు.

గీ. అరయ నేమి కావలయు బీతాంబరుండు
వ్యాసునకు నారదునకు రుక్మాంగదునకు
దాశరాజల్లునకును సుధామునకును
పుణ్యపురుషుండవగు నత్రిమునికి నీకు.

అత్రి—అటులయినఁ బోయిరమ్ము

గోవిం—పెద్దల యాశీర్వచనము గోరుచుంటి- ఆర్యా!

చం. ఇడుమలఁగుందికుంది గడి
యించితి వాతనిముక్తి సంపద
ల్వడయుచునుంటి వేయెడకుఁ
బాఱఁగనీక దొంగనోడ్డుకున్
మెడగుదిబండ వైతివి సు
మీ, ననుదీవనలిచ్చి పంపు మ
య్యెడకు; శిరంబు మొగ్గితి సి
దే మునిసత్తమ! తాపసోత్తమా!

అత్రి—(తనలో) ఇది నాకంతమునకె చుట్టినాఁడు- ముందలే దిగులువడుచుంటి. అందు నాకన్న నాత్రేళినే పాడిపింపఁజూచుటా! భగవంతుఁడిచ్చోటు వానిచనఁగ నేఁజీవించుటెట్లు? వీని నేవిధినాశీర్వదించుట? (యోజించి) నాకప్పుడ భగవంతుఁడు గోష్ఠీవనప్రయాణ కథం జెప్పెను. దానికిప్పుడు తరుణం బేతెంచె. సత్యసంకల్ప వచనం బమోఘం బు. దూరమాలోచించఁగ నీతఁడు వెంటఁగొనిపోక మానఁడు. అతఁడు తల్లి వెనుకన్నఁడి తలయూడించుకొనుచు జాగెడు లేదూడవోల్పన చనకమానఁడు. అటులయిన నాగతియేమి? ఎల్ల కలకాలకింటికిఁ జిచ్చంటించుకొనినట్లగును- (తలయూచి) అన్నిటికి మూలపురుషుండగు నాహరియే కలండు పోయిపాదాక్రాంతుండ నయ్యెద- (ప్రకాశముగా) ఓయీ! బ్రాహ్మణబాలకా! నీవాన

రింప బోవు కార్యము దుర్ఘటము. ఒక్కపట్టున నలవడునది కాదు. పెక్కుడుములపాల్పడియెదవు. మనసుంజిక్కబట్టి కార్యసాధకుండవు గమ్ము పోయిరమ్ము.

కం. జగమునఁ దిన రుచి తెలియున్
దిగినప్పుడలోతు తెలియు ధీవర! వేవే
ఖగపతిఁ బ్రార్థింపఁగఁ జను
మగుఁ గావుత యిష్టసిద్ధి యార్యులు మెచ్చన్.

గోవిం—మహాప్రసాదము. (నమస్కరించి నిష్క్రమించును.)

అత్రి—ఇంక నాలసించిన గార్యము మించును. ముందుగ నేగి యా భావదేవునితో నేదేని యొక కట్టుబాటు గావించుకొనవలెను. (నిష్క్రమించును)

---

2 స్థలము. శ్రీ భావనారాయణాంతికము- ప్రవేశము అత్రిమహాముని. సాష్టాంగనమస్కార ప్రణామంబు లాచరించి.

అత్రి— దేవా! మహానుభావా! ఆదిమధ్యాంతరహితా! (విచారముతో)

శా. కష్టా! పుణ్యతపోధనంబున భవ
త్కారుణ్యముంబొందియే
నెట్లో యిచ్చట నిన్ను జూచుకొని ప్రో
ద్వేగించెదన్ దేవ! యి
ప్పట్టుం జెట్టునకొక్క పక్షిగ నొన
ర్పంజూతువే నన్ను ? నీ
చెట్టన్ వీడిన సున్న నా బ్రతుకు ల
క్ష్మీనాథ! యోజింపవే.

భావ—అత్రీ! ఇత్తఱి నేమింత భయభ్రాంతుఁడవగుచుంటివి!

అత్రి—ఏమి! ఏమియును నెఱుంగని యమాయికుని వలె నడుగుచుంటివి!

కం. ఔరా! శ్రీహరి! యెంతటి
గారడివాఁడవు! ప్రపంచకములం బెనువన్
మారణ మొనరింపంగను
గారకుఁడవునన్ను ప్రశ్నఁ గారించెదవే ?

భావ—భక్తాగ్రేసరా! అడుగనిది యమ్మయేనిఁ బెట్టదుకదా. నీవిచారకారణముం దెల్పుము. ప్రతిక్రియ నొనరించెద.

అత్రి—చెప్పనోరు రాకున్నది. నాలుక తడబడుచుండె. అంతరంగమున శోక సముద్రము పొంగి పొరలుచున్నది. శ్రీమన్నారాయణా ! పురాణ పురుషా !

ఉ. బాలుఁడు బ్రహ్మచారి గుణ
వంతుఁడు బ్రాహ్మణుఁ డాంధ్రదేశ ధీ
శాలుఁడు సాక్ష్యమిచ్చుటకు
చయ్యన నిన్గొనిపోవవచ్చె హా!
తాలిమి లేదు భక్తపర
తంత్రుఁడ వీవిఁక వానితోఁడ బో
జాలుదువేని యత్రిమునిని
సత్తము నేయుయ పాలొనర్తువో ?

భావ—ఇంతియకదా ! నిన్ను నేఁబాయఁదునన్న భయము వీడుము వడ్డించువాఁడు నీవాఁడైనఁ గడపంక్తినున్న నేమి ?

ఉ. ఇచ్చోట నుండునంచు వచ్చి
యించినకాలము సెల్లె ముక్తి వే
నిచ్చితి భక్తులందఱికి
నిరిక జనస్వలె దక్షిణంబు నం

దచ్చుపడంగమానవుల
కాదటదర్శన మీవలెన్ ద్విజుం
చచ్చగనన్ను నమ్ముకొని
యాతఁడువచ్చెను బోకతప్పునే !

అత్రి— హా! మొదటినుండియు ననుమానించుచు నేయుంటి. నేఁటివఱకునిన్ను చేఁజిక్కించుకొని యానందాబ్ధి నోలలాడుచున్నను లోనభయంబు మాత్రము విడువలేదు.

ఉ. ఎక్కడనెట్టిభక్తవరుఁ
డెట్టితపం బొనరించువాఁడొ యా
పెక్కడికట్టెలేచిపరు
వెత్తుదువోయని యొక్కడొక్కనా
కెక్కుడుగుందు నేఁటి కది
యే నిజమాయె మహానుభావ! యీ
పెక్కరణిం జనంగలవొ
వాకించుక దిక్కును జూపకిమ్మహిన్.

భావ— తాపసాగ్రణీ! వెతలఁగుందకుము

కం నినువీడ గూనిబత్తునిఁ
గొనువాఁడను భయమువీడుగోవిందుఁడు ముం
దునడిచి దారింజూపఁగఁ
జనువారము నీవునేను సంయమివర్యా !

అత్రి— ధన్యుండనైతి. దేవా! పుణ్యాత్ముఁడనైతి. హృదయంబునగల విచారము పటాపంచలై పోయె. సంతసముం గూర్చితివి. జగద్రక్షకా? నీకనంతసేవాంజలులు. మనము కుదుటబడితిమి (నిట్టూర్పువిడిచి)

మ. చనుదున్ నీ వెను వెంట నేను బరమే
శా! కాశికాపట్టణం
బున నాకుంగల కార్యమేమి! యిటనీ
వున్ లేమి నిక్షేపమౌ
ల్లను శ్రీలొల్లను భోగభాగ్యముల నొ
ల్లన్నాకు నీపంచఁ గ
ల్గిన భిక్షాన్నము చాలు వద్దితరముల్
శ్రీభావనారాయణా !

భావ—ఇంకఁబొమ్ము-

అత్రి— (ఎఱఁగి నిష్క్రమించును- భావనారాయణుఁడు యథావిధిగ నుండును- అంతప్రవేశము గోవిందుఁడు సాష్టాంగదండ ప్రణామంబులాచరించి)

మ. మును వేదంబులు మ్రుచ్చిలించి యాల యం
భోధిం బ్రవేశించి డా
గిన నీచాత్ముని సోమకాసుర ఖలున్
గీలించి తూటాడి వే
దనికాయంబును దెచ్చి దేవతల మ
ధ్యన్ బ్రహ్మ బల్ పెద్దఁ జే
సిన మత్స్యాకృతిమూవతార ! ప్రణతుల్
శ్రీభావనారాయణా!

మ. అమృతంబుం జిలుకన్ సురాసురలు సం
ప్రార్థింప క్షీరోదధిం
గమఠంబై గిరిమోసి దేవతల ప
క్షంబూని పాల్పంచి మే

లమరన్ లక్ష్మిని గౌస్తుభంబుఁగొని క
ల్యాణంబు గైకొంటి వో
రిమిఁగూర్మాతిశయావతార! ప్రణతుల్
శ్రీభావనారాయణా!

మ. అవనింజాపగఁజుట్టి చంకనిడి గ
ర్వాయత్తుఁడై దంభుఁడై
యవివేకుండయి సాగిపోయెడి హిర
ణ్యాక్షున్ జిగీషించి వా
ని వధన్ జేసి ధరాపురంధ్రిని గడిం
దింబోచి రక్షింతు వో
ర్మి వరాహాతిశయావతార! ప్రణతుల్
శ్రీభావనారాయణా!

మ. వనమాలీ కథలన్నఁ గార్యములనన్
బాదాబ్జ సంపూజ ల
న్నను సర్వోధకుఁడౌచుఁ గన్నకడుపున్
గాసించి తాల్ ఉర్వి నీ
టను ముంచు హిరణ్యకశ్యపుని గో
టంజీల్చు ప్రహ్లాదుఁ గా
చి, నృసింహాతిశయావతార! ప్రణతుల్
శ్రీభావనారాయణా!

మ. అమరాధీశుజయించి విప్రకుల పూ
జారంభుఁడై దానస
ద్వ్రములుండైన బలిం బదత్రయ ధరి
త్రిన్ వేడి పాతాళలో

కము ముట్టంగనుద్రొక్కి వాసవభయా
క్రాంతంబుఁ బోకార్చు పే
రిమి దండంబులు నీకు పొట్టివడుగా!
శ్రీభావనారాయణా!

మ. మిగులన్ గర్వముజెంది చక్రము నిరున్
మించన్ ప్రసంగింపఁగా
జగతిన్ దానిని వేకరంబులతో మె
చ్చన్ గార్తవీర్యార్జునుం
డగుమంచీవు కుఠారధారివయి గ
ర్వాటోపముంగూల్చితో
భృగురాడ్బ్రహ్మ! ధరామరుండ! ప్రణతుల్
శ్రీ భావనారాయణా!

శా. ఘోరారణ్యమునన్ వసించితివి చీ
కుం జింతయున్ వీడి హా
హా! రాత్రించరుఁ డొక్కఁడాలిఁ గొనినాఁ
డంచున్, నెపంబూనుచుం
గ్రూరానీకము లోకకంటకుల గ
ర్వోద్రేకినా వార! శ్రీ
ద్రీ! రామాతిశయావతార! ప్రణతుల్
శ్రీభావనారాయణా!

శా. తాళంబొండు ధ్వజంబుగాఁగఁ బ్రియమొం
దన్ రేవతీదేవి యి
ల్లాలై మోదముగూర్పఁగాఁ బ్రబల దు
ష్టాత్మం బ్రబలంబున్ ధగం

గూలంజేసి యశంబు బొందితివి కై
కొన్నాఁడ వెంతే జయ
శ్రీలన్ ధూర్వహరౌహిణేయ ! ప్రణతుల్
శ్రీ భావనారాయణా !

మ. పిననాఁడే పెనుబోలు నీడ్చుకొని వే
వే పెద్దవై నాఁడ వం
తన కాళీయశిరంబుఁ దొక్కితివి పా
దద్వంద్వమున్ మోపి ; మే
దినిపైఁ బాండవపక్షపాతివయి కొం
తేయాగ్రజున్ రాజుఁ జే
సిన కృష్ణాతిశయావతార ! ప్రణతుల్
శ్రీ భావనారాయణా !

మ. కలికాలాంతమునన్ ఖలుల్ ప్రబలి దు
ష్కర్మల్ పోనర్పంగ ; దూ
ఱులు లోకంబున బెల్లుగాఁగఁ దురగా
రూఢుండవై ఖడ్గహ
స్తుఁడవై మ్లేచ్ఛులఁ దున్మితున్మి క్షితి బం
ధు ప్రేమలన్నిల్పి భా
సిలుదో హో ! కలికావతార ! ప్రణతుల్
శ్రీ భావనారాయణా !

భావ- (ప్రత్యక్షంబయి) మెచ్చితి మెచ్చితి. హృదయానంద భరితుండనైతి. భవద్భక్తికి సంతసించితిని. పుడమి వేలుపా!

కం. ఓ జన్నిగట్టు కన్నా !
పూజాఫల సిద్ధియయ్యెఁబో ; మద్దేహం

బీఁజాలుదుఁ గోరుము నీ
వే జయముంబొందినాఁడ విచ్చఁదెలుపుమా !

గోవిం-కం. వందనము శ్రీహరీ ! గో
విందా ! దండంబు ; దేవ ! వే మొక్కులివే
బృందారక వినుతా ! యా
నందమయా ! కేలుమోడ్పు నాపాలిసఖా !

## దండకము,

శ్రీమన్మహాదేవ దేవా ! జగత్సృష్టికర్తా ! లసద్వేద గేయప్రభావా ! సధర్మోపదేశవ్రతా ! సత్యసంకల్ప జేగీయమానా ! త్రిలోకస్తుతాదుష్టసంహారకా ! శిష్ట సంరక్షకా ! సర్వలోకైకపూజార్హా ! సద్భక్తకల్పద్రుమా ! సాధుయోగీంద్ర సన్మానదక్షా ! రమానాథ ! ముక్తిప్రదాతా ! మహాత్మా ! హరీ ! నిర్గుణా ! నిర్వికారా ! పరంధామ ! కంసాంతకా ! వాసుదేవా ! హృషీకేశ ! దామోదరా ! పద్మనాభా ! విరాట్పూరుషా ! భావనారాయణా ! శౌరి ! శార్ఙ్గి ! నమస్తే నమస్తే నమః.

జగజ్జేగీయమానా ! నీవెఱుంగనిదికద్దా !

ఉ. అందఱుఁగన్నె పుట్టుతటి
నల్లుఁడఁగానగు నాకొసంగ నీ
ముందఱఁ దాను మాటయిడి
మున్ను; కుమారితగల్గ నేఁడు దా
నిం దన యిచ్చవచ్చిన మ
నీషికొసంగఁగ నున్నవాఁడు గో
విందుఁడ ! మామ సేత లివి
విశ్వమునన్ నిజమింత తెల్పుమా.

భావ- గోవిందుఁడా! మామయల్లుండ్రతగవులలో నొరులెవ్వరు నిలుకరాదే!
ఇత్తఱి నన్నేమి చేయుమనియెదవు?

గోవిం-ఉ. బందుగులందు నేఁ బ్రతిన
వట్టితి నిన్గొని తెత్తునంచు గో
విందా! యనుగ్రహింపఁ గద
వే ముద మొందఁగలాఁడ మాపురం
బందున నీదుసాక్ష్యమున
కాస్పదమాయెను రమ్మురమ్ము పే
ర్మిం దలబెట్టు నామెడను
రెండవజం దెవుఁబోగు నిల్పుమా!

భావ- భక్తవరా! మీపురంబిచ్చటికెంతదవ్వైనను లక్ష్యముంచక నీతోఁ
జనుదెంచెదను. ముందీవు ప్రోవందీయుము.

మ. మునుముందీ, పటు వెన్కనేను, మణులం
బొల్పౌవిమానంబు, స
న్మునియత్రా నత్రియు, నీశ్వరుండును, గడున్
మోదంబుతోవత్తు మిం
కను బేర్లేనివి పెద్దమ్రాను లిరువం
కల్ దీర్చు; మార్గంబునం
దునఁ జూడందగ దీవు వెన్కఁగన నం
దున్నిల్తుమో బాలకా!

(ప్రవేశము అత్రి, ఈశ్వరుఁడు, విమానము, అనామకవృక్షములు)

అందఱు-దేవాధిదేవా! ఏమును నీవెనువెంట జనుచున్నవారము.

భావ- రండు రండు స్వర్ణపురంబున గాపురంబుండి దండంబువెట్టి దర్శనం
బొనర్చు భక్తశిఖామణులకు ముక్తినొసంగుచుండుదును.

కం. కలకంఠ! రమ్ము వెంటం
దరలుమయా! యాత్రి! పురముదాటుమిఁకన్ వే
గిరమే రత్నవిమానము!
త్వరపడు గోవింద! ముందుదారింజూపన్.

గోవిం-మహాప్రసాదము (నడుముగట్టి ముందునడుచును. అందఱును వెనుకనే చనుదురు.)

---

## పంచమాంకము.

1 స్థలము అరణ్యము. ప్రవేశము గోవిందుఁడు కాశినుండి

గోవిం- ఉ. వెన్నుని శాసనంబుగన
వెన్కకుఁజూడఁగరాదు భక్తిసం
పన్నుఁడు ధీరుఁడత్రిముని
పన్నుఁడుగా యెటువంటి కుట్ర; వి
ద్వన్నుతుఁడైన చక్రధరు
పల్కుల కేటికి హానివచ్చు ? నూ
రన్నను జేరువాయె నిఁక
నందఱ మొక్కటియౌదు మచ్చటన్.

ఈయరణ్యంబుంగడచినతోడనే స్వర్ణపురంబు దృగ్గోచరంబగును. ఇలువీడి నేఁటికి నాలుమాసంబులు నిండవచ్చె. మా మామయుఁ బురజను లెల్లరును నాకై వేచియుందురు. కాని మామకుమాత్రము సదుద్దేశం బుండదు.

శా. పాలుండెక్కడ ! శౌరియెక్కడ ! కృపా
పారీణతన్ సాత్త్వసం
భారంబెక్కడ ? కాలికిన్ బలపమున్
బంధించి వారాణసీ
దూరంపుంబటునంబొవర్చునోకో ! ప్రా
ద్దుంబుచ్చి య[illegible]
డో తేపో దలగోకుకొంచు వడి [illegible]
నున్నాఁడటం చెంచెదన్.

కానిమ్ము ఇప్పటికైన మామకు తెలిసిరాకపోదు.

"శ్లో. పరిత్రాణాయ సాధూనాం ।
వినాశాయచ దుష్కృతాం ।
ధర్మసంస్థాపనార్థాయ ।
సంభవామి యుగేయుగే॥"

అనుపవనం బనుభవంబునకు దెప్పుచుంటి (చెవియొగ్గి విని) వెనుకవారి మాటల ధ్వనివినవచ్చుచుండె సాగిపోవలయును. (పోవును)

(వెనుక నేప్రవేశము భావనారాయణుండు శితికంఠుఁడు అత్రిమున్నగు వారు)

శితి—దేవా! అకనఁబడునదియేకదా స్వర్ణపురము.

భావ—అవును

శితి—అద్దానికంతటి మాహాత్మ్యంబెట్లుకలిగినది వినవలతు.

భావ—జగత్సృష్టికిఁ బూర్వమదియె నా నివాసస్థలము అజుఁడునన్ను వెదకికొనుచు నచ్చటికింజనుదెంచి ముకుళితహస్తుఁడై నిలువంబడ నాతని గౌరవించి దీవించి బ్రహ్మాండముల నెల్లసృజియింపఁగ నాధిపత్యానిం జేసితి- విరించియు మహాప్రసాదంబని జగత్సృష్టికిం బూనుకొనియె, అప్పుడతండందందుదిరుగాడ జలమయప్రదేశంబెల్ల ఘనీభవించి ధరాతలంబుగమారె. అయిన ప్రాణికోటి సృష్టించుటకు పంచభూతంబులు శ్రీమన్నారాయణ పదసేవనుండికలిసి గాకున్న యవి. అట్టితటి వేలుపుల పెద్ద చేయునదెద్ది యులేక నావద్దకేతెంచి చలామణిగానియధికారంబువలని ప్రయోజనంబేమి యని మొఱపెట్టుకొనియె.

ఉ. ఆవిధి పల్కులన్ విని కృ
పాయుతచిత్తుఁడనౌచు బంచభూ
తావళినందు నిల్పితి హా
రా! యతఁడుం గృతకృత్యుఁడౌచు నెం

తే విలసిల్లె ; నందుననె
యేము వసించితి మూస్థలంబ గో
ష్ఠీ వనమందు నెల్లెడఁ బ్ర
సిద్ధి వహించెఁ ద్రిలోకపూజ్యమై.

ఆకనఁబడునదియె తుంగభద్రానదీతీరము. అన్యవృక్షశాఖలనడుమంగ నం బడునవియే స్వర్ణపురహర్మ్యాగ్రంబులు. ఏగుదమురమ్మా. గోవిం దుఁడును నియమంబుగ మొగంబువెనుకకుఁ ద్రిప్పకయే మార్గమును జూపుచున్నాఁడు. (ముందుకునడిచిపోవుదురు. తెరయెత్తబడును. స్వర్ణపురము)

గోవిం—(ప్రవేశించి) అబ్బ! చచ్చిచెడిచేయంగల విన్నపములాయె. ఊరను నచ్చిపడితి దీనిం జూడంగనె హృదయంబానందసాగరంబున దేలుచుం డెను. ఆహా!

ఉ. కన్నుల పండువాయెఁ బురిఁ
గాంచిన ; నుండెనుగాదె యున్నయూ
రన్నను కన్నతల్లియని
యంచనె యొక్కటియన్నమాట ; పి
రన్నగృహాంబులయ్యాది ; ధ
రామరు పేరయబిడ్డె యయ్యాదే
చెన్నపరెడ్డి కౌగిలిదె
చేగువనున్నదె యన్నసత్రమా.

(ప్రవేశము పేరయ్య)

పేర—(గోవిందునిజూచి) ఎనగావిశ్చేది? ఓహో! గోవిందుఁడా! కాశీ నుండియేనా రాక.

గోవిం—(భుజముపైఁ జేయివైచి) పేరయ్యా! ఎన్నినాళ్ళకుచూచితిని! కాశీనుండియే వచ్చుచుంటిని. పురంబునందందఱు సుఖాయత్తులు గదా.

పేర—ఆ! నీవువెళ్ళిన పనేమయింది?

గోవిం—ఏమి యగును. వెనుకకుతిరిగి చూడుము.

పేర—(వెనుకకు జూచి) ఓరిపిడుగా! దేవుణ్ణేలాకోక్కొని వస్తూన్నావే! ఏమిఏమి! మా నాన్నని మాఅమ్మని మాతాతయ్యని పిల్చుకొస్తా.
(గంతు వేసి పరుగెత్తుకొనిపోవును)

గోవిం—ఇంక నీవార్త పురంబంతయు వ్యాపించును. (ముందుకు నడచిపోవును ఆవెనుకనే ప్రవేశము భావనారాయణుండు మున్నగువారు)

శితి—దేవా! ఈవిందు గాలిదుటచే నీపురజనులు వైకుంఠవాసులైరి.

భావ—శితికంఠా! ఈప్రదేశంబున కేను ప్రాతకాపునే. మనమెల్లర మీ నగరంబువెలుపల నుపవిష్టులమయ్యెదము. అచ్చటికి నూరివారందఱు విచ్చేయుదురు. అప్పుడుధర్మము సత్యము స్థాపింపందగు.

(నిష్క్రమింతురు)

(ప్రవేశము భూపాలుండు, అమాత్యుండు)

భూపా—అమాత్యశేఖరా! వినుటయే కాని యున్న నువమిట్టిది కన్నదిలేదు. నేండు సుదినము.

అమా—ఆంధ్రభూమండలాధిపా! ఆ సూనిగోవిందుని సద్భక్తిని ప్రశంసింప వలయును. ఒక్కనివల్ల వేనవేలు జనులు జన్మపావనులగుచున్నారు.

భూపా—ఈనారాయణునకేను భూపదీపనై వేద్యాగాధనలకై మాన్యము లొసంగువాండ. ఇంతకంటె మనకుంగావలసినదేది!

అమా—మేలు మేలు రాజా! నీకీర్తి బ్రహ్మాండం బున్న యంతకాలమునిలుచును.

భూపా—పోదము రమ్ము. అటుచూడుము. ప్రజలు గుంపులుగుంపులుగ నెటులేగుచుండిరో! వింధ్యాచలంబునకు దక్షిణంబుననుండు ననంతప్రాణి కోటులు విష్ణు సందర్శనాభిలాషులై చనుచుండిరి. రమ్ము. దమ్ము.

(నిష్క్రమింతురు)

(ప్రవేశము ఇరువురు ఎఱికలు)

1. ఎఱి—వోరిపోరయ్యీ జేగిరారాస్సె దేముడొచ్చెద్రోయి.

2. ఎతి—ఆడికెల్లద్దురా నీవిట్టిగూల దేముడెత్తుకపోతాడ్ ఇంటిక్పోదాం గావాన్స్.

1. ఎతి—అ నారాణసాంయి కాడకెల్లి దండాలెస్తాం.

2. ఎతి—శ సేశరం పట్టేవేందాన్స్ రా ఆడకెల్దాం

(నిష్క్రమింతురు)

(ప్రవేశము గోవిందుఁడు కేశవుఁడు)

గోవిం—మామా! ఇప్పుడేమందువు? సాత్యము దెచ్చుకొంటిఁ జూచితివా?

కేశ—విష్ణుభక్తులలో మొన గాడవు

కం. నీ కితన మన పురంబున
లోకేశుఁడు, విష్ణు, భక్తలోలుఁడు వెలిసెన్
మాకింత భక్తిముక్తిం
జేకూర్చితి వీవ యిష్టసిద్ధుఁడ వనఘా!

(తనలో) శ్రీహరికరుణాకటాక్షంబుగల వాఁడయ్యేఁ గన్యనిచ్చుటకు సంశయంబున మార్పులేదు- (ప్రకాశముగా) గోవిందుఁడా!

శా. వేదోక్తుల్ దలకింపఁదుగాఁ దపము గా
వింపన్ లభింపండు నా
మాయామానుష విగ్రహుండతని నే
మాడ్కిం బ్రశంసించితో
యే యానోక్తుల మెప్పుగైకొనితివో
యేభంగి లాలించితో
శ్రీయోధాయుఁడు నీదువెంటఁబడి వి
చ్చేసెన్ గృపాబంధువై.

గో—శా. మామా! నేఁటికి శంకపీడితివె? స
న్మార్గంబుఁ జాటింతువే?

భామినిన్ సత్యవచోక్తి నిల్పెదవె? స
మ్మోదంబుతో నీదు బా
లామాణిక్యము నాకు నూర్చెదవ? యా
లాగైన మేల్; కానిచో
రా! మా మాధవపాలికిం జనుద మా
ర్యా! రమ్ము రా రమ్మికన్
(కేశవునిలాగుకొనిపోవును)

---

2 స్థలము. స్వర్ణపురము.

భావనారాయణుండు కంఠకంఠుండు అత్రి ఉపవిష్టులైయుందురు. పేరు లేనిపెద్దమానులు మౌనముగనుందురు. అంతకేశవుఁడు గోవిందుఁడు ఆంధ్రదేశభూపాలుఁడు మున్నగు వారందఱుఁ బ్రవేశించిప్రణమిల్లి నిలబడుదురు.

భావ — కేశవా!

ఉ॥ ఆరయఁ గోవిందుండవు సు
హేమమతిఁ గంటుండ నామపై నిరతం
బౌదుండ పూరివారి నడు
మం గమఁబెద్దవు సత్యనిష్ఠనం
చారుఁడ; వాడితప్పిన ప్ర
జాతతి కెట్టిది శిక్ష చెప్పు మీ
వే రహిఁ గేశవా! వినెద
మెల్లర మిందు సధర్మబుద్ధిమై.

పిల్లనిచ్చి ముడివెట్టెదనని కాశిలో నాకడ మున్ను బాసఁజేసి యూపా శాగ్రస్థుల నిప్పుడీయునని వచింప నీయంతవానికిఁ జెల్లునా?

కేశ—(చేతులు మోడ్చి) పురాణపురుషా! భక్తపరతంత్రా! ధర్మాధర్మ విచక్షణా!

ఉ॥ నేను గలాఁడలం చితనిఁ
గొంచెపుమానిసిఁగాఁ దలంచితిం
గాని రమేశుఁ డెచ్చొడి మ
గండని చూడను; సర్వలోక స
న్మానితుఁ డీతఁడింకను జ
నార్దన! నిన్నన నాదుపాతకం
బే నశియించె నీపదము
లే మదినమ్మితి నాదరింపవే.

భావ—నీసద్బుద్ధికి మెచ్చితి గోవిందుఁడా!

గోవిం—దేవా! (కరములు మోడ్చి నిలువంబడును)

భావ—ఈవు నిక్కముగ మామకూతునే పెండ్లాడెదవా?

గోవిం—(నవ్వుచు)

ఉ॥ ఎందుకు కాశికే నరుగు
టెందుకు నన్ముని యాత్రిదర్శనం
బెందుకు కాళ్ల వ్రేళ్లఁబడి
యీాశు నినుంగొనివచ్చు టెందు కీ
సందడి యెల్ల జాయకయి
సత్యముకై కద యో ముకుంద! గో
వింద! వచింపనేటికిఁక? 
పెండిలి యాడుదు మామకూతునిన్.

భావ—బాగుబాగు కేశవా! ఈతనికిఁ బిల్లనిచ్చి పెండ్లిచేయుటకిఁ వొడంబడి యెదవా?

కేశ—దేవా! పురాణపురుషుండవు మాపురంబునఁ బ్రత్యక్షంబయితివి మా తనువులు శాశ్వతములా? నీయిచ్చవచ్చినతెఱంగు చేయుము. ఆది పురుషుండవీస్వర్ణపురంబుననుండి మాబోఁటి జీవులకింతముక్తి యొసఁగు టయే సదాకోరుచుంటి.

భావ-ఉ॥ ఏనువసింతు నిందె కల

యేడు జగంబులుదీరుదాఁక; నా

యీ నిలయంబునందు నెవఁ

డేనియు దీపముఁబెట్టి మ్రొక్కువాఁ

డేని దివంబునిత్తుఁ గల

యింతనె యొక్కని కన్నమిచ్చెనే

నీ నను జేర్చుకొందు; నిది

నిక్కము భూసుర! సూరిభాసురా!

చ॥ కనుఁగొనఁ దుంగభద్ర జల

కంబులనాడి ఫలంబుఁ బుష్పముం

గొని మఱసార నాకిడెదు

కూళకునైన సుఖంబులిత్తుఁ బ్రో

వను జనుచుండి నన్నుఁ దలఁ

పం గడఁ ఖానికినేని ముక్తి ని

త్తును నిరతంబు సత్యమునఁ

దూగెడు ఖానికిఁ జెప్పనేటికిన్.

ఇంకఁబోయి నీకూతుందెచ్చి పాణిగ్రహణంబునొనర్పుము.

కేశ—ధన్యోస్మి (నిష్క్రమించి కూతుని నక్కలక్ష్మి వెంటనిడుకొని ప్రవే శించును.)

భావ—గోవిందుఁడా! ఈవువురూపవంతుఁడవనుదువుగాక.

గోవిం—(వెంటనే రూపవంతుఁడగును) బాపనారాయణునకు ప్రణమిల్లి లేచును)

కేశ—(గోవిందుని చేతఁ గన్నె చేయినిడును-)

భావ—శుభముశుభము-(మంగళము)

గీ॥ ఆయురారోగ్య పుత్త్రభాగ్యాభివృద్ధిఁ
బరగి సుఖులై వధూవరుల్ వఱలుగాక
అందమున కన్న సుగుణంబ యరసి యరసి
యుర్విఁ బెండ్లిండ్లు జనులు చేయుదురుగాక.

గద్య.

శ్రీమన్నారాయణవరప్రసాదాసాదిత కవితాధురీణ కాండిన్యసగోత్ర
సుక్తిముక్తాఫల గోమఠాన్వయ ప్రశస్త వరదాచార్య పౌత్ర
రంగాచార్య వేంకటాంబా తనూజ రామానుజాచార్య
ప్రణీతంబయిన శ్రీ సాక్షి దృశ్యప్రబంధము
సంపూర్ణంబగు

నమె



